# నటన

శ్రీనివాస చక్రవర్తి



జయంతి పబ్లికేషన్స్
గోపాలరెడ్డిరోడ్డు :: విజయవాడ-2

ప్రథమముద్రణ 1946
ద్వితీయముద్రణ 1963


ముద్రణ:
శ్రీ శారదా ప్రెస్,
విజయవాడ-2.



వెల రు 1–50

సంపాదకులు:
యం. పెదపూళ్ల

# మనవి

ఈ నా రచనకి మాతృక రిచర్డ్ బొలెస్లవస్కీ వ్రాసిన 'యాక్టింగ్' అనే గ్రంథం బొలెస్లవస్కీ పోలెండు దేశీయుడు. ప్రపంచ విఖ్యాత నాటక కళా కోవిదుడు. మాస్కో ఆర్టు థియేటర్‌లో నటుడుగా, మాస్కో ఆర్టుథియేటర్ స్టూడియో డైరెక్టరుగా తన నాటక కళావైదుష్యం వెల్లడించి మన్నన నొందిన కళాకారుడు. ఈ గ్రంథంలో నాటకకళా సమస్యల్ని వ్యాసరూపంలో కాకుండా సంభాషణరూపంలో వెలువరించటం వల్ల చదువరులకు ఎంతో ఆసక్తికలుగుతుంది. ప్రతిఅధ్యాయం శిల్పసమన్వితమైఒక్కొక్క నాటికగారూపొందినట్లుఅనిపిస్తుంది.

ఇక ఈ గ్రంథం తెలుగులోకి తీసుకురావటంలో కొన్ని చోట్ల అనువదించాను. కొన్నిచోట్ల భావం మాత్రం తీసుకున్నాను. కొన్నిచోట్ల స్వతంత్రించాను. తెలుగు వాతావరణం సృష్టించటానికి శాయశక్తులా ప్రయత్నించాను. తెలుగు నటులు తమ కళాశక్తిని తీర్చి దిద్దుకోటానికి తగిన గ్రంథాలు ఇంతవరకు తెలుగులో బహుకొద్ది. ఈనాగ్రంథంవల్ల ఆంధ్రనాటక రంగానికి ఏమాత్రం పుష్టి చేకూరినా ధన్యుణ్ణిగా భావిస్తాను.

నటులు, కళాకారులు, పాఠకులు ఈ నా రచనను ఆదరిస్తారనే ఆశిస్తున్నాను.

నాట్యకళమీద నా రచనలన్నింటినీ వరసగా ప్రకటించ సంకల్పించిన మిత్రులు, జయంతి పబ్లికేషన్స్ అధినేత శ్రీ యం. పెరుమాళ్ళుగారికి నా కృతజ్ఞతాభివందనాలు.

— శ్రీనివాస చక్రవర్తి

# విషయ సూచిక

# ఏకాగ్రత

[ఉదయం. నాగది తలుపు కొట్టిన చప్పుడు.]

నేను : యెవరు? ... ... రాండి.

[18 ఏండ్ల అపరచితవ్యక్తి జంకుతూ జంకుతూ ప్రవేశించి నాకేసి కళ్ళప్పగించి చూసింది. చేతిలో సంచిని గట్టిగా నలిపేస్తోంది.]

ఆమె : నా పేరు కిన్నెర ... మీరు ... మీరు అభినయం నేర్పుతారటగా?

నేను : ఊహుఁ... అభినయంలాంటి కళలు నేర్పితే అబ్బేవి కావు. ఏ కళలోనైనా ప్రావీణ్యం సంపాదించాలంటే ప్రతిభ వుండాలి. లేకపోతే రాణించదు. సాధనచేసి కళను పెంపొందించుకోవచ్చుగాని ప్రతిభనుమాత్రం సృష్టించలేం. చిత్తశుద్ధితో, చైతన్యంతో నాటకకళలో కృషిచేసి అభివృద్ధిపొంద సంకల్పించుకున్న వారికి యింత సహాయంచేస్తా. అంతే.

కిన్నెర : నాకు నాటకకళ అంటే మహాయిష్టం. నాకు సాయం చెయ్యండి.

నేను : ఇష్టముంటేచాలదు. అసలు నాటకకళ అంటే యిష్టం లేని దెవరికి ? నాటకకళకి జీవితమంతా అంకితం చెయ్యాలి, ధారపొయ్యాలి. మనసంతా దానిమీదే లగ్నంచెయ్యాలి. నాటకకళకోసం సర్వమూ పరిత్య

జించాలి. అష్టకష్టాలు పడాలి. అన్నిటికన్నా ముఖ్యం ప్రతిఫలాపేక్ష లేకుండా స్వత్వమునే అర్పించాలి.

కిన్నెర : అర్థమైంది. మాస్కూలు నాటకాల్లో చాలా వేషాలు వేశాను. నాటకకళారాధన కష్టాలు తెచ్చిపెట్టు తుందనీ నాకు తెలుసు. నాకేంభయంలేదు. వేషంవేసే అవ కాశం చిక్కాలేగాని... ... ... ...

నేను : నీకు వేషంవేసే అవకాశం చిక్కదనుకో ?

కిన్నెర : యెందుకని ?

నేను : నీకు ప్రతిభ లేదని వారు భావించవచ్చు.

కిన్నెర : నేను మా స్కూలునాటకాల్లో వేషంవేశాను.

నేను : యేం వేషం ?

కిన్నెర : బాహుకుడి వేషం. చూచిన వాళ్ళంతా నా వేషం బావుందనిమెచ్చుకున్నారు. ముఖ్యంగామామాష్టారూ మా అత్తయ్యా నావేషం అద్భుతంగా వుందన్నారు. నాకు మాంచి ప్రతిభవుందని కూడా అన్నారు.

నేను : బావుందన్నవాళ్ళని ఆక్షేపించడానికి కాదు గాని వాళ్ళంతా నాటకకళా కోవిదులేనా ?

కిన్నెర : మా మాష్టారు వృద్ధుండుడు. బాహుకుడు వేషం వేయ టంలో నాకెంతో సాయపడ్డారు. నాటకకళలో నిధి.

నేను : సరే. మీ అత్తయ్య ?

కిన్నెర : మా అత్తయ్య బళ్ళారి రాఘవాచారి నాటకాలు చాలా చూసింది.

నేను : సరే బావుంది. మీ మాష్టారు బాహుకుడు పాత్రలో "అగ్నులారా ! నను దహింపుడు" * అనే మాటలు చెబుతూ యెలా నటించమన్నాడు ?

కిన్నెర : యిప్పుడు మీముందు నటించి చూపమంటారా?

నేను : అక్కర్లా. ఆమాటలు వుచ్చరించటం యెలా అభ్యసించావు ? అక్కడ నువ్వు సాధించ దలచిన ఆశయమేమిటి ?

కిన్నెర : యిలా పాదాలు రెండూ దగ్గిరగా పెట్టి, కొంచెం ముందుకు వంగి తలా, చేతులూ పైకెత్తి, గుప్పిళ్ళు బిగించి వూపుతూ నిట్టూర్పు విడిచి విధిని దూరుతున్నట్టు, "అగ్నులారా! ననుదహింపుడు," అని బిగ్గరగా అనాలి.

నేను : మంచిది. బాహుక పాత్రను నీవెలా అర్థంచేసుకున్నదీ, నీకెంత ప్రతిభవున్నదీ తెలుసుకోటానికి యీమాత్రం చాలు. యింకోటి, మొదట విధిని దూరుతున్నట్టు తర్వాత విధిని దూరకుండా మామూలుగా అభినయించు. దాని భావం మాత్రం వ్యక్తపరుస్తేచాలు.
[ఆమె ఆట్టేపేపు ఆలోచించలేదు. విధిని దూరటానికి అలవాటు పడిపోయింది.]

కిన్నెర : విధిని దూషించేటపుడుయిలా:"అగ్న ... లా ... రా! నను ... ద ... హిం ... పుడు."

---

* చూడు : చిత్రనళీయం అంకం 5, రంగం 3 బాహుకుని దీర్ఘ స్వగతం.

[కిన్నెర విధినిదూషిస్తూన్నట్టు నటించాలని ప్రయత్నిం చింది. కిటికీలోనించిచూశాను. ఆకాశం ఆమెనుచూచి నవ్వు తున్నట్లనిపించింది. నాకూ నవ్వువచ్చింది.]

విధిని దూరకుండా యింకోవిధంగా... తోచడంలా... సరే. యిది వినండి...

[ఆమె కంగారుపడి మాటలు మింగుతూ తొందర తొందరగా]

"అగ్నులారా! ననుదహింపుడు"

[పూర్తిగా కంగారు పడిపోయింది. చేతిలో సంచిని నలిపి పారేస్తోంది. విరామం]

నేను : ఊ...నీవు యువతివి. విధిని దూరేముందు ఒక్క నిమిషమయినా తటపటాయించావా? ఆ మాటల్లోని అంతర్గత భావాన్ని వెల్లడిస్తానికి ప్రయాస లేకుండా సహజ ధోరణిలో వుచ్చరించలేకపోయావు. సరిగమలు రాకుండానే త్యాగరాజ కృతి పాడదామనుకున్నావు. ముఖం చిట్లించుకున్నావు. కవి భావాన్నీ, అనంత ఉద్వేగాన్నీ ఛిన్నాభిన్నం చేశావు. సాహితీవేత్తకు వుండవలసిన ప్రాథమిక లక్షణం–యితరుల భావాలను ఉద్దేశాలను, మాటలను క్రమబద్ధంగా వ్యక్తీకరించే శక్తి నీకు లేదు. నాటకాల్లో వేషాలు వేసి ప్రయోజనమేమిటి? నాటకకళ అనే భావాన్నే నాశనం చేశావు.

... ...

[విరామం. ఆమె నాకేసి మరణశిక్ష పొందిన నిర్దోషి చూసినట్టు చూసింది. చేసంచి కింద పడిపోయింది.]

కిన్నెర : అయితే యిక నేను వేషాలు వేయడానికి పనికి రానంటారా ?

నేను : పనికిరావన్నాననుకో !

[విరామం. కిన్నెర కళ్ళల్లో భావం మారింది. నా హృదయంలోకి సూటిగా చూసింది నేను వేళాకోళ మాడడంలేదని గ్రహించింది. పళ్ళు కొరుక్కుని మనోవేదనను కప్పిపుచ్చాలని యత్నించింది. కాని ప్రయోజనం లేకపోయింది. పెద్ద కన్నీటి బొట్టొకటి ఒలికింది. ఆ కన్నీటిబొట్టు నా హృదయాన్ని కదిలించివేసింది. ఆమె తట్టుకుని మందస్వరంలోఅంది]

కిన్నెర : అయితేనేం నేను వేషాలు వేసితీరాలి. యింకో దారిలేదు.

[నా హృదయం ద్రవించింది.]

నేను : సరే. ఒక్క విషయం. యీ నిమిషంలో నువ్వు చూపిన హావభావాలు నాటకకళకు అలంకారాలు. నాటకరంగంమీద నీ భావి అభివృద్ధికి సూచకాలు. ఈ క్షణంలో నువ్వు నిజంగా బాధపడ్డావు. రసానుభూతి పొందావు. ఈ రెండూ యే కళకైనా – ముఖ్యంగా నాటకకళకి – అతి ప్రధానమైనవి. యింత బాధపడితేనేగాని సృష్టించడంలో వుండే ఆనందం – కళా సృష్టిలో వుండే ఆనందం – పొందలేవు. అందుకని యిప్పటినుంచీ మనిద్దరం కలసి నాటకరంగంలో కృషి చేద్దాం. నీశక్తికి మించని ఒక చిన్న విషయం తీసుకుని దానికి వాస్తవిక, కళారూపమిద్దాం. నాటకరంగం

మీద నీ పురోవృద్ధిలో యిది మొదటిమెట్టుగా వుపయోగపడుతుంది.

[కన్నీరు మాయమైపోయింది. ఆమె పెదవులపై మందహాసం తాండవించింది.]

ఎవరన్నా తనపనిలో నిమగ్నమైవుండగాచూశావా? వందలకొలది ప్రాణాలకి బాధ్యత వహించే వైమానికుణ్ణిగానీ, భూతఅద్దంలోంచి చూస్తూ పరిశోధించే జీవశాస్త్రజ్ఞుణ్ణిగానీ, క్లిష్టమైన వంతెన నిర్మించడానికి ప్లానులు దగ్గిరపెట్టుకొని పనిచేసే ఇంజనీరునిగాని లేకపోతే ఒక పాత్రకు రసవ్యాఖ్యానం చేస్తున్న ఒక మహానటుణ్ణి 'వింగు' లోనించి కానీ చూశావా ?

కిన్నెర : బళ్ళారి రాఘవాచారి రామదాసు అభినయిస్తుంటే చూశాను.

నేను : అలా చూస్తూంటే నీకేం అనిపించింది ?

కిన్నెర : రాఘవాచారి అభినయం అద్భుతంగా వుంది.

నేను : యింకా ?

కిన్నెర : నేను వింగులో వున్నాననే పరిజ్ఞానమే ఆయనకు లేదు.

నేను : అదే, అదే అతి ప్రధానమైన విషయం. నువ్వున్నావనే పరిజ్ఞానమేకాదు, చుట్టూ ప్రేక్షకులు వున్నారనే పరిజ్ఞానంకూడా అయనకిలేదు. వైమానికునిలాగా, జీవశాస్త్రజ్ఞునిలాగా, యింజనీరులాగా అతను ఏకాగ్ర చిత్తంతో నటిస్తున్నాడు. ఈ ముక్క "ఏకాగ్రత" జ్ఞాపకం వుంచుకో. ఈ ఏకాగ్రత అన్ని కళలకు, ముఖ్యంగా నాటకకళకు ప్రాణం.

"ఒకే ఒక నిర్దిష్ట విషయంమీద మనో, మేధా శక్తులను లగ్నంచేసి మన కిష్టమైనంతవరకు—మనశరీరం తట్టుకో కలిగినంత వరకు మనస్సును నిలుపగలుగునట్టు చేసే గుణమే ఏకాగ్రత."

ఒకజాలరిని యెరుగుదున్నాను. అతను ఒకమాటు పెద్ద తుపానులో తెడ్డుచేతబట్టి మనసునంతా పడవనడపటం మీదనే కేంద్రీకరించి 48 గంటలు పడవ నడిపాడు. ఒడ్డుచేరిందాకా శరీరాన్ని అదుపులో పెట్టుకున్నాడు. తర్వాత స్మృహతప్పింది. ఈ శక్తి, నినునీవుఅదుపులో పెట్టుకునేశక్తి, ప్రతిసృజనాత్మక కళాకారునికీ ప్రాథమిక లక్షణం. ఈ లక్షణాన్ని నీ అంతరంగంలో కనుగొనాలి. పూర్తిగా అభివృద్ధిపర్చుకోవాలి.

కిన్నెర : అభివృద్ధిపర్చుకోటం యెలా ?

నేను : చెప్తాను తొందరపడకు. నాటకకళకు ప్రత్యేకమైన ఏకాగ్రత కావాలి. వైమానికునికి దిక్సూచి, జీవశాస్త్రజ్ఞుడికిభూత అద్దం, యింజనీరుకి ప్లానులు. యివన్నీ ఏకాగ్రతకూ సృష్టికీకావలసినబాహ్యాదృగ్గోచరవిషయాలు. వారికి సాధించాల్సిన భౌతికలక్ష్యంవుంది. శక్తినంతా దానిమీద వారు కేంద్రీకరిస్తారు. అలాగే శిల్పి, చిత్రకారుడు, కవి. కాని నటుని విషయంవేరు. అతని ఏకాగ్రతకు లక్ష్యం యేదో చెప్పు ?

కిన్నెర : అతను ధరించే పాత్ర.

నేను : ఆ – అభ్యసించేదాకానే. అధ్యయనంచేసి రిహార్సలు చేసింతర్వాత నటుడుకళాసృష్టి ప్రారంభిస్తాడు. యింకో

విధంగా చెప్పాలంటే మొదట అన్వేషిస్తూ సృష్టిస్తాడు. తర్వాత మొదటి బహిరంగ ప్రదర్శనంలో నిర్మాణాత్మకంగా సృష్టిస్తాడు. యిక అభినయమంటే యేమిటి?

కిన్నెర : అభినయం ! నటించటం ...యేవిటో నాకు తెలీదు.

నేను : అభినయ మంటే యేవిటో తెలుసుకోకుండానే నీజీవిత మంతా దానికి అంకిత మిద్దామనుకున్నావా ?

"నాటకకళద్వారా జనించుతున్న మానవహృదయ జీవనమే అభినయం."

(Acting is the life of the human soul receiving its birth through art)

సృజనాత్మక రంగంలో నటుని ఏకాగ్రతకు లక్ష్యం మానవ హృదయం. అతని కృషి మొట్టమొదటి దశలో, అనగా అన్వేషణలో ఏకాగ్రతకు వస్తువు అతని హృదయం, అతనిచుట్టూ వుండే స్త్రీ పురుషుల హృదయాలు తర్వాత నిర్మాణాత్మక దశలో ఏకాగ్రతకు వస్తువు అతని హృదయంమాత్రమే. అంటే, భౌతికంగా దృగ్గోచరం కానిదానిమీద, లోతు చూపులు పరపితేనేగాని నీలో గోచరించని దానిమీద అమిత ఉద్వేగ, ఆంతరంగిక పోరాట సమయాలలో జీవితంలో ద్యోతకమయేదానిమీద, మనసును కేంద్రీకరించటం యెలాగో తెలుసుకోవాలి. యింకోవిధంగా చెప్పాలంటే, లేని ఉద్వేగాలను సృష్టించుకునో, వూహించుకునో వాటిమీదమనసును కేంద్రీకరించాలి.

కిన్నెర : లేని ఉద్వేగాలమీద కేంద్రీకరించడం ఎలా ? అసలు ప్రారంభించడం ఎలా ?

నేను : సరిగమల దగ్గిరనుంచీ ప్రారంభించాలి. సంగీతానికి సరిగమలలాగానే మనకి పంచేంద్రియాలు. కన్ను, ముక్కు, చెవి, స్పర్శ, నాలుక. త్యాగయ్యకృతికి సరిగమల లాగానే యివి మనకి వుపకరణాలు వీటిని నీ గుప్పిటలో పెట్టుకోవడ మెలాగో నేర్చుకో. నీ పంచేంద్రియాలమీదా నీ మనసంతా కేంద్రీకరించి, కృత్రిమంగా వాటిచేత పనిచేయించటం, వాటికి వివిధ సమస్యలనుయిచ్చి పరిష్కార మార్గాలను సృష్టించటం నేర్చుకో.

కిన్నెర : మీవుద్దేశం నాకు వినడం యెలాగోకూడా తెలీదనా?

నేను : జీవితంలో తెలిసివుండవచ్చు. ప్రకృతి నీకు నేర్పింది బహుకొద్ది.

కిన్నెర : (ధైర్యంగా, సవాలుచేస్తున్నట్టు) ఊహుఁ – స్టేజ్ మీదకూడా తెలుసు.

నేను : అలాగేం ? సరే, చూద్దాం. కూర్చున్న పళంగా, ఆమూల ఒక ఎలక గోడ గీకుతోందని వూహించుకుని వినడం అభినయించు.

కిన్నెర : ప్రేక్షకులు యేరీ ?

నేను : ప్రేక్షకుల గొడవ నీ కెందుకు ? నీవేషం చూద్దామని ప్రేక్షకులు యింకా కాళ్ళు విరగొట్టుకోటంలేదు. నే చెప్పినట్టుచెయ్యి. ఆ మూలగోడను ఒక ఎలక గీకు తోందని వూహించుకుని వినడం అభినయించు.

కిన్నెర : సరే. (మొదట కుడిచెవితో తర్వాత ఎడమ చెవితో వినటం నటించింది. కాని నటన చాలా కృత్రిమంగా ఉంది. సున్నితమైన ఎలుక కీచుడు వింటున్నట్టు లేదు)

నేను : సరే. బజారులో బాండువాయిస్తున్నారనుకో. అదెట్లా వింటావు ?

[కిన్నెర కిందటితడవలాగానేనటించింది. బాండు వింటున్నట్టులేదు. నాకు నవ్వొచ్చింది. తననటనలో యేదో దోషముందని గ్రహించి ఆమె ఖంగారుపడింది.]

నేను : నీ నిస్సహాయతను గుర్తించావనుకుంటాను. శబ్దం ఆట్టే రాని ఎలుక కీచుడు వింటానికీ, బిగ్గరగా వాయిస్తున్న బాండుమేళం వింటానికీ భేదం నువ్వు గ్రహించలేదు.

కిన్నెర : మీరు చెప్పిన భావం వ్యక్తంచేయటం మహాకష్టం.

నేను : బాహుకుడివేషం వేసి విధిని దూరడంమాత్రం తేలికా? మానవ జీవితంలోని స్వల్పవిషయాన్నైనా సరిగా సృష్టించడం నీచేతకాదు. మనసును ఒకవిషయంపై కేంద్రీకరించటం నీ చేతకాదు. జటిల భావాలనూ, ఉద్వేగాలనూ సృజించటం చేతగాకపోగా నీ పంచేంద్రియాలే నీ స్వాధీనంలో లేవు. ప్రతినిత్యం యిలాంటివి అభ్యసించాలి. కావాలంటే యిలాంటి సమస్యలు వెయ్యి చెబుతా. కొన్నివేలయినా ఊహించుకోవచ్చు.

కిన్నెర : సరే. ఆలాగే మీరు చెప్పినట్లల్లా సాధన చేస్తాను. అప్పుడు నేను నాటకరంగంమీద పైకివస్తానా?

నేను : యీమాత్రంతో నువ్వు పెద్ద స్టారువి అయిపోతా వనుకున్నావేమో ? ఊహుఁ—వినడం, చూడడం, యథార్థంగా సంవేదన (భావం) పడటం చాలదు. యివన్నీ వందలవిధాలుగా నటించటం నేర్చుకోవాలి. నువ్వు వేషం వేసుకుని స్టేజీమీద నిల్చున్నావనుకో. తెరయెత్తుతారు. వెళ్ళిపోతున్న కారుమోత వింటున్నట్టు నువ్వు అభినయించాలనుకో. ఆ సమయంలో ప్రేక్షకుల మనసు వివిధ విషయాలమీద కేంద్రీకరించి వుంటారు. కొంతమంది తమ యింటిగొడవలు ఆలోచిస్తుంటారు. కొంతమంది రాజకీయాలు మాట్లాడుతుంటారు. కొంతమంది దృష్టిపక్కనవున్న ఆడవాళ్ళమీద వుంటుంది. భావనా జగత్తులోని కారు వెళ్ళిపోయేధ్వని అనే స్వల్పవిషయం నువ్వు వింటున్నా, వీరంతా తమ ఏకాగ్రతకంటె నీ ఏకాగ్రత ప్రధానమైందిగా భావించేట్టు చెయ్యాలి. నీ భావనా జగత్తులోని కారుముందు తమ స్వంత విషయాలు తలపెట్టటం సమంజసంగాదని వారనుకునేట్టు చేయాలి. ఆక్షణంలో తమకంటె నువ్వుశక్తివంతమైనదానవనీ, ప్రపంచంలోకెల్లా ప్రధానమైన దానివనీ, నీకెవ్వరూ ఆటంకం కల్గించరాదనీ భావించేట్టు చెయ్యాలి. చిత్రకారుడు చిత్రం గీస్తుంటే యెవరూ అతనిపనికి ఆటంకం కల్గించరు. నటుని సృష్టికి ఆటంకం కల్గేటట్లు ప్రేక్షకులు ప్రవర్తించారంటే అదినటునితప్పు. నటులందరికీ ఏకాగ్రత వహించే శక్తివుండి, నేచెప్పిందంతా అర్థంచేసుకుంటే యెటువంటి చిక్కులూరావు.

కిన్నెర : దీనికి నటుడికి కావలసిందేమిటి ?

నేను : ప్రతిభ, శిల్పం. ప్రతి నటుడు మూడు విషయాలు అభ్యసించాలి. మొదటిది: శరీర వ్యాయామం. శరీరం లోని ప్రతి అవయవమూ, ప్రతి కండరమూ, ప్రతి స్నాయువూ నీ అదుపాజ్ఞలో వుండాలి. సంపూర్ణ శరీర సౌష్టవంగల నటుడిచేత యెంతటి పనైనా చేయించవచ్చు

కిన్నెర : అయితే శరీర వ్యాయామానికి యెంతకాలం వినియోగించాలి ?

నేను : ప్రతిరోజూ గంటా గంటన్నర. కసరతు, నాట్యం, సంగీతం, మూకాభినయం, వేషధారణ, ప్రాణాయామం, కత్తిసాము అభ్యసించాలి. యిలా సంవత్సరన్నరపాటు విడవకుండా అభ్యసిస్తే నటుడికి మంచి అవయవ సౌష్టవం యేర్పడుతుంది.

యిక రెండోది : మేధా, సంస్కృతీసంబంధమైంది. కాళిదాసు, భవభూతి, భాసుడు, షేక్స్పియర్, మాల్యేర్, ఇబ్సెన్, గోర్కీ మొదలైనవారి కళా కౌశల్యంగురించి చర్చించాలంటే నటుడికి సంస్కృతి కావాలి ఈ మహా రచయితలు యే ఆశయంకోసం తమ జీవితాలు అంకితం చేశారో వారి నాటకాలు యెలా ప్రదర్శించబడ్డాయో తెలిసుండాలి. ప్రపంచ సాహిత్యం అవలోకించిన నటులు కావాలి. వివిధ దేశాలలో, వివిధ కాలాలలో వచ్చిన కవితారీతులను అవగాహన చేసుకున్న నటులు కావాలి. చిత్రకళా

చరిత్ర, శిల్పకళాచరిత్ర, సంగీతకళాచరిత్ర తెలుసుకుని ఆయా కాలాలకు సంబంధించిన శైలిని జీర్ణించుకుని, గొప్ప చిత్రకారుల వ్యక్తిత్వం గుర్తించిన నటులు కావాలి. మన స్తత్వశాస్త్రం, ఉద్వేగ ప్రదర్శనా విధానం, భావాల క్రమబద్ధతా తెలిసుండాలి. మానవశరీర శాస్త్రం, గొప్ప గొప్ప శిల్పఖండాలూ పరిశీలించి వుండాలి. నటుడికి స్టేజీమీద యివి తారసిల్లుతాయి. వాటితో పనిచేయాల్సి వుంటుంది. మేధాశిక్షణవల్ల నటుడు రకరకాల పాత్రలు అభినయించగల్గుతాడు.

ఇక మూడోది అతి ప్రధానమైనదీ మానవ శిక్షణ, మానసిక సంస్కారం. సంకల్పమాత్రంచేత వ్యక్తీకరించవలసిన ప్రతి చేష్టా, ప్రతి ప్రవర్తనా వ్యక్తీకరించడానికి అనువుగా అభివృద్ధిచెందిన మనసు లేనిదే నటించి ప్రయోజనంలేదు.

అంటే రచయిత చిత్రించిన యే అవస్థలోనైనా మనగల్గిన మనసు నటున కుండాలి. అటువంటి మనసు లేనిదే నటుడు గొప్పవాడు కాజాలడు. చాలాకాలం యెంతో శ్రమకోర్చి అనేక ప్రయోగాలద్వారా దీనిని సాధన చెయ్యాలి. ఆ సాధనలో యీ క్రింది శక్తులను వృద్ధిచేసుకోవాలి: వూహించగల్గిన వివిధ అవస్థలలో పంచేంద్రియాలను స్వాధీనంలో వుంచుకోవాలి. భావ స్మృతి, ఆవేశ స్మృతి, భావనాస్మృతి, రూపకల్పనా స్మృతి అభివృద్ధి పర్చుకోవాలి.

కిన్నెర: వీటినిగురించి నేనెన్నడూ వినలేదే!

నేను : యెన్నడూ వినకిపోయినా "విధిని మారడ" మంత తేలికే యివికూడా. భావనా శక్తిలో విశ్వాసం, భావనాశక్తి వృద్ధిచేసుకోవాలి. స్వాభావికత, పరిశీలన, మనోబలం, వివిధ ఉద్వేగాల వ్యక్తీకరణశక్తి, హాస్య భావం, విషాదభావం పెంపొందించుకోవాలి. యింతే కాదు—

కిన్నెర : యివన్నీ అభివృద్ధిపరచుకోటం సాధ్యమేనా ?

నేను : స్వతసిద్ధంగా వుండవలసిందేగాని పెంపొందించుకోరానిది యింకోటుంది. అదే 'ప్రతిభ'.

[కిన్నెర నిట్టూర్చి, తీవ్రంగా ఆలోచించ సాగింది, నేనూ మౌనంగా కూర్చున్నాను.]

కిన్నెర : మీరు నాటకకళని యెదో గొప్పదానినిగా, అతి ప్రధానమైనదానినిగా చిత్రిస్తున్నారే ?

నేను : అవును. నా దృష్టిలో నాటకకళ అతి నిగూఢమైంది. ప్రపూర్ణతకోసం, అమరత్వంకోసం మనం కనే స్వప్నాలు అద్భుతంగా ఆ నిగూఢతలో మేళవిస్తాయి. అటువంటి నాటకకళకోసమైతేనే మన జీవితాలు ధార పోయవచ్చు.

[నేను లేచాను. కిన్నెర నాకేసి విచారంగాచూసింది. ఆ నేత్రాలు వ్యక్తీకరించిన భావం నాకు అర్థమైంది.]



# 2. ఉద్వేగస్మృతి

[ సంవత్సరం గడిచింది. ఒకరోజు కిన్నెర మళ్ళా వచ్చింది. ఆమెలో ఈతడవ పూర్వపు జంకులేదు. మెల్లగా నా గదిలో ప్రవేశించింది. ఆనందంతో మొహం వెలిగి పోతోంది. మందహాసం చేసింది.]

కిన్నెర : హల్లో !

[ఆమె నా కళ్ళల్లోకి సూటిగా చూసింది. ఆకారం శిల్పి చెక్కినట్లుంది. అవయవాలన్నీ పూర్తిగా ఆమె స్వాధీనంలో ఉన్నట్లున్నాయి. ఎంతమార్పు !]

నేను : బావున్నావా? నువురావటం నాకు మహాసంతోషంగా వుంది. యిప్పటిదాకా నువు రాకపోయినా నీ విషయం నే నాలోచిస్తూనే వున్నాను. మళ్ళీ నువు వస్తావనుకో లేదు. మొదటిసారే నిను హడలగొట్టేశానేమోనని భయపడ్డాను.

కిన్నెర: ఊహుఁ— నేనేం హడలిపోలా. మీరు నాకు బోలెడంత పని కల్పించారు. ఆ "ఏకాగ్రత"తో యెంత అవస్థపడ్డాననుకున్నారు! అంతా నను జూచి నవ్వారు. ఒకమాటు యింటికివెళుతూ "నా జీవతసౌఖ్యం" అనే విషయంమీద మనసును అతిగా కేంద్రీకరించాను. దారిలో కారుకింద పడిపోయేటంత పనైంది. మీరు చెప్పిందంతా తూచా తప్పకుండా అభ్యాసంచేయటా

నికియిలాంటిసమస్యలుఅనేకంతీసుకున్నాను. ఇలాఏకా గ్రతకోసం పాటుపడడంతో వుద్యోగంకాస్తావూడింది. వుద్యోగం పోతేపోయిందనే నిర్లక్ష్యభావం నటించాలని యత్నించాను.విజయంపొందాను.పూర్వంకంటెఇప్పుడు నాకు మనోబలం యెక్కువైంది. యింటికి మహా కులా సాగావెడుతున్నాను. మంచివేషం దొరికినంతహుషా రుగావుంది నా పని. యెదురుగా కారువస్తోందటం నేను గమనించలా. అదృష్టవశాత్తూ సముద్రానికి పక్కకి ఒక గెంతుగెంతి ప్రమాదం తప్పించుకున్నాను. నాకు మహా భయం వేసింది. గుండె గబగబా కొట్టుకుంది. కాని "నా జీవిత సౌఖ్యం" మర్చిబోలా. కారు డ్రైవరు కేసి చూసి చిరునవ్వునవ్వి "సరే-యిక వెళ్ళు" అన్నాను. అతనేదో అన్నాడు. కారుఅద్దం వెనకనించి మాట్లాడా డేమో నాకేం వినిపించలేదు.

నేను : అతని మాటలు వినిపించకపోవటం ఒకందుకు మంచిదే నేమో !

కిన్నెర : అలాగేం ? అతను నన్నలా నిరసించి మాట్లాడటం సబబే నంటావా ?

నేను : అతన్ని సమర్థించవచ్చు. నీ ఏకాగ్రతను అతనెంత తీవ్రంగా భగ్నంచేశాడో అతని ఏకాగ్రతను నువ్వూ అంత తీవ్రంగా భగ్నంచేశావు. అక్కడా అసలు నాటకం ప్రారంభమైంది. ఫలిత మేమంటే అద్దంవెనక నించి అతను మాట్లాడటం, యిక పొమ్మని నువ్వు చెప్పటం నాటక ప్రక్రియ.

కిన్నెర : ఊఁ—ప్రతీదీమీకు నవ్వుతాలుగా వుంటుంది.

నేను : ఉహూఁ – నవ్వుతాలేంకాదు. అదంతా ఒక నాటిక లాంటిది. మంచి గమనం గల నాటిక.

కిన్నెర : అది నా అభినయశక్తికీ, నాటకమంటే నాకుండే భావానికీ తోడ్పడిందంటారా?

నేను : ఆ – తప్పకుండా తోడ్పడింది.

కిన్నెర : యెలా ?

నేను : యిదంతా విపులంగా చెప్పాలంటే చాలాసేపు పడుతుంది. ముందు కూర్చో. యివాళ యిలా యెందుకొచ్చావు ? మళ్ళీ యే బాహుక పాత్రలో అభినయించాల్సి వచ్చిందా ?

కిన్నెర : [సిగ్గుపడుతూ] ఆ –

నేను : యిందులో నువు సిగ్గుపడాల్సిందేంలేదు. ముఖ్యంగా నీ బాహుకవేషం విషయంలో. అప్పుడు నువు చిత్తశుద్ధితో అభినయించావు. సంవత్సరం దాటిపోయింది. యింతకీ అసలు విషయం యిది: ఒక్కసారే అంతా అవుపోసన పట్టాలనుకున్నావు. సాధ్యంకాలా. కాకపోతే సరైన మార్గాన్నే అభ్యాసంచేశావు. నీ అంతట నువే ప్రారంభించావు. యెవరో వచ్చి సాయపడతారని కాలయాపన చెయ్యలేదు. ఒక కుర్రవాడుండేవాడట. అతను రోజూ స్కూలుకు వెళ్ళేటప్పుడు "నేను విమానంయెక్కి వెళ్ళితే స్కూలుకు యింకా తొందరగా చేరుకుందునుగదా !" అని అనుకునే వాడట. చివరికి యేమైందో తెలుసా ?

కిన్నెర : ఊహుః – తెలీదు.

నేను : అతను ఒక్కడే న్యూయార్కు-నుంచి పారిస్ విమానంలో వెళ్ళాడు. అతనిపేరు లిండ్ బర్గ్.

కిన్నెర : ఊఁ-[విరామం] నేను మీతో యేదో ఆషామాషిగా కాకుండా గభీరంగా మాట్లాడాలని వచ్చాను.

[ఆమె యిప్పుడు కలలు కంటోంది. చేతికిదొరికిన ప్రతి విషయాన్నీ సవ్యంగా ఉపయోగించుకోటం బాగానేర్చుకుంది. అంతరంగంలోకానీ బాహ్యాకారంలోగానీ ఏమాత్రం ఉద్వేగ చిహ్నం కనిపించినా వృధాపోనీయదు. ఏమాత్రం మీటినా గీతం వెలువరించే వీణలాగ ఆమె. మంచి ఆరోగ్యంగా బలంగా ఉన్నమానవునిలా జీవితంలో దొరికిందంతా జీర్ణించుకోగలదు. తనకు కావలసింది అట్టేపెట్టుకుని అవసరంలేంది విసర్జించి వేయగలదు. మంచి అభినేత్రిగా తయారయే సూచనలు కనిపిస్తున్నాయి.]

కిన్నెర : నేను నా స్వంతవిషయం మాట్లాడాలని వచ్చాను. (మందహాసంచేసి) నా కళనుగూర్చికూడా ...

నేను : నువు 'నాకళ' అని పలకే విధానం నాకేంబావుండలా. నిను చూసుకుని నువే చిరునవ్వు నవ్వుకుంటున్నావు. యితర్లకి ఆనందం కల్గించటం మినహా వేరే ప్రయోజనంలేని విషయాలు నరాలుబిగించుకుని మాట్లాడతావెందుకు ?

కిన్నెర : యితర్ల సంగతేమోకాని నాకుమాత్రం కళే జీవనాధారం. అందుకని గభీరంగానే మాట్లాడవలసివచ్చింది. నాకు ఓ వేషం యిచ్చారు. నాలుగురోజులనుంచీ

ప్రాక్టీసు చేస్తున్నా. కాని నాకేసంతృప్తికరంగాలేదు. యింకో రెండుమూడు రోజులుచూసి యింకొకళ్ళని వెయ్యమంటారు. అంతా మంచిగానే మాట్లాడు తున్నారు. నాకెలా తోడుపడాలో ఒకళ్ళకీ తెలిసినట్లు లేదు. వాళ్ళంటారు "యింకొంచం బిగ్గరగా చెప్పు", "మాటలు సరిగా అందుకో", "సంవేదన ప్రకటించు", "నవ్వు", "నిట్టూర్చు" యింకాయింకా యెన్నో చెప్పారు. కాని అంతమాత్రంతో వేషం రక్తికట్టదని నాకు తెలుసు. వేషం రక్తికట్టించేదేదో నాకుబోధ పడలేదు. యేవిటది?యెక్కడుంది? దాన్ని సాధించటం యెలా? మీరు చెప్పినట్లుగాచేశాను. నా శరీరమంతా నా అధీనంలోనే వుంది. సంవత్సరం అభ్యాసంచేశాను. పాత్రకి కావలసిన భంగిమలన్నీ సునాయాసంగా పట్ట గలను. అప్పుడు నాకేంబాధవుండదు నా పంచేంద్రి యాలను క్రమబద్ధంగా వుపయోగించగలను. అభిన యిస్తోంటే నాకెంతో ఆనందంగా వుంటుంది. కాని యీవేషంఅభినయించడం ఎలానో తెలీటంలేదు. యేం చెయ్యను ? నను పొమ్మంటే నానా అవస్థలు పడాల్సి వస్తుంది. "నువు చాలా తెలివిగలదానివి. కాని నీకు అనుభవంచాలదు," అనిచెప్పి నను వెళ్ళగొట్టేస్తారు. యేమిటా అనుభవం? నావేషంగురించి యెవరూ నాకు చెప్పక్కర్లా.అంతా నాకు తెలుసు. నేనే ఆపాత్రనని ప్రతి నిమిషమూ భావించుకోగలను. ఆ పాత్ర అభినయించ గలననినాకు ధైర్యంవుంది. అయితేనేం?'అనుభవం!'ఆ

మోటారుడ్రైవరు అన్నమాటలు అనాలనివుంది. కాని అవి నాకు వినిపించలేదు. అతని ముఖకవళికనుబట్టి చూస్తే అతనన్న మాటలు సరైనవేనని తోస్తుంది. ఆ మాటలు యేమైవుంటాయో వూహించగలను. వాటిని మళ్ళా వుపయోగించటం యెలా ?

నేను : ఊ – ముందుకుసాగిపో. ఆ మాటల్ని వూహించి ప్రయోగించు. నేనున్నానని వెనకాడవద్దు.

[ఆమె ఊహించినమాటలు చెబుతూంది.]

నేను : ఆనందంగావుందా ?

కిన్నెర : ఆ – [మందహాసం]

నేను : సరే. యిక నీవేషంవిషయం. నీ అంతట నువ్వే అభినయ విధానం యేర్పరచుకో. సరైనవిధానమే యేర్పరచుకోగలవు. నేను చెప్పినట్లుగాచేసి, ఆ పాత్రను నువుతగివుంటే, యింకేవిటి! వేషం రక్తి కట్టితీరుతుంది. దానికోసం బెంగెట్టుకోకు. కృషి, ఓర్పు. ఈ రెండూ వుంటే విజయం తథ్యం.

కిన్నెర : సరేగానీండి మాష్టారూ ... ...

నేను : కూర్చో, నిజంచెబుతున్నా విను. సంవత్సరంనుంచి అభ్యాసంచేస్తూ అభినయానికి కావలసినదంతా పోగు చేసుకుంటున్నావు. జీవితాన్ని పరిశీలించి జీర్ణం చేసుకున్నావు. చూసిందీ, చదివిందీ, విన్నదీ, అనుభవించిందీ వృథా పోనియ్యలేదు. వాటితో నీ మస్తిష్కం నింపుకున్నావు. కావాలని బుద్ధిపూర్వకంగా కొంత,

నింపుకుంటున్నావనే పరిజ్ఞానం లేకుండా కొంత నింపుకున్నావు.

కిన్నెర : నేనేంచేసినా బుద్ధిపూర్వకంగానే చేస్తాను. నేను భావనాజగత్తులో తందనాలాడే మనిషినిగాను.

నేను : అవును, నీసంగతి నాకు బాగా తెలుసు. నటులు అలానేవుండాలి. లేకపోతే వాళ్ళు కలలు కనలేరు. భావనాజగత్తులో తందనాలాడకుండా భౌతికజగత్తులో భూమిమీద స్థిరంగా నిలబడగలవాడే నటుడుగా రాణించుతాడు. అందుకనే ప్రపంచంలోకల్లా ఐరిషు పోలీసులే గట్టివాళ్ళు. డ్యూటీలోవుండగా నిద్రపోరు. మేలుకునిఉండే కలలు కంటారు.

కిన్నెర : అదేవిటండీ ! నాకు వాళ్ళు వేషం యిచ్చారు. నేనా వేషం వెయ్యాలి. యీ గొడవంతా వదిలేసి ఆ పోలీసుల సంగతి మాట్లాడతా రేమిటి ?

నేను : ఉహుఁ – నేను కలలయొక్క ఉపయోగాలను గురించి మాట్లాడుతున్నాను వ్యక్త, అవ్యక్త స్వప్నాలు వుపయుక్తమైనవి, అవసరమైనవి, వినయవిధేయతలతో నువ్వు పిల్చినపుడల్లా పరుగెత్తుకు వచ్చేవి. అటువంటి స్వప్నాలను ఉపయోగించుకోవటం గురించి మాట్లాడుతున్నాను. నువ్వు 'అనుభవం' అని పిల్చే నీ స్వభావంలోని భాగాలే యీ స్వప్నాలు.

కిన్నెర : సరే బావుంది. మరి నా వేషం విషయం ?

నేను : నీలోని నీస్వత్వమును నీ వేషానికి అనుగుణంగా సిద్ధ పరచి నీ పాత్రతో మేళవించు. అప్పుడు నీ అభి నయం అద్భుతంగా వుంటుంది.

కిన్నెర : సరే - యిక ప్రారంభిద్దాం.

నేను : నువ్వు నీకు తెలీకుండానే యెంతో కృషి చేశావన్న విషయం ముందు విశ్వసించాలి. యిక, నీ వేషంలో చాలా ముఖ్యమైన సీను యేదీ ?

కిన్నెర : తల్లీ కూతుళ్ళ "పార్టింగు సీను". ఆ కుటుంబం కడు బీదకుటుంబం. అదృష్టవశాత్తూ, ఒక భాగ్యవంతు రాలు ఆ కూతురు శ్రేయస్సుకోరి ఆమెను దగ్గరికి తీసి చదువు చెప్పిస్తాను రమ్మని ఆహ్వానించింది. కూతురు సందిగ్ధావస్థలో పడింది ఒకవైపున కన్నతల్లి. ఆమెని వదిలిపెట్టి వెళ్ళిపోవటం, బాధాకరంగా వుంది. యింకో వైపున ఆ భాగ్యవంతురాలి అండనుచేరితే మంచి మంచి చీరలు, నగలు, చదువు యింకెన్నో లభిస్తాయి. తల్లిమీద ప్రేమా, జీవితసౌఖ్యం ఈ రెంటికీ సంఘ ర్షణ ప్రారంభమైంది. యిటు తల్లిని తెంచేసుకోలేదు. అటుపట్టబోయే అదృష్టాన్ని కాలదన్నాలేదు. ఈ రెంటికీ మధ్య కొట్టుకుంటోంది. కాని సుఖపడాలనే కోరిక బలీయంగా వుంది. వెళ్ళిపోతానని తల్లితో చెప్పటానికి నోరాడటంలేదు. యిదీ ఆ సీనులో నా వేషం అవస్థ.

నేను : సరే. యీ సీను యెలా అభినయించదలచావు ? మీ డైరెక్టరు యేం చెప్పాడు ?

కిన్నెర : వెళ్ళిపోవటమంటే సంతోషం. కన్నతల్లి మీది ప్రేమను కోసేసుకుని వెళ్ళిపోవాల్సి వచ్చిందిగదా అని విచారం. యిదీ మా డైరెక్టరు చెప్పింది. ఈ రెంటిని మేళవించలేకపోతున్నాను.

నేను : ఒకే సమయంలో నువు సంతోషమూవ్యక్తీకరించాలి, విచారమూ వ్యక్తీకరించాలి.

కిన్నెర : యీ రెండు రసాలను ఒకేసారి అనుభవించలేక పోతున్నాను.

నేను : నువ్వేకాదు, యెవరూ అనుభవించలేరు. కాని నువు ఆ పాత్రవి అయిపోవచ్చు.

కిన్నెర : రసానుభూతి లేకుండా ఆ పాత్రని అయిపోవడమే? యెలా సాధ్యమవుతుంది?

నేను : అవ్యక్త, సంవేదనాస్మృతుల సహాయంతో సాధ్య పడుతుంది.

కిన్నెర : అవ్యక్త, సంవేదనాస్మృతులు? అంటే మీ వుద్దేశ్యం నేను సంకల్పించుకోకుండానే నా సంవేదనలను స్మృతిలో వుంచుకోగలనా?

నేను : మనకి సంవేదనలను జ్ఞప్తిలో వుంచుకునే ప్రత్యేక జ్ఞాపకశక్తి వుంది. అది దానంతటదే, దానికోసమే పనిచేస్తుంది. యీశక్తి ప్రతి కళాకారుడిలోనూ వుంటుంది. మన జీవితంలోనూ, మన వృత్తిలోనూ అనుభవాన్ని అత్యావసరభాగంగా చేసేది యీశక్తే. మనం తెలుసుకోవలసిందల్లా దాన్ని వుపయోగించు కునే విధానం.

కిన్నెర : ఆశక్తి యెక్కడుంది ? దాన్ని సంపాదించటంయెలా? యీ శక్తిని గురించి ప్రాక్పం యెవరికైనా తెలుసా ?

నేను : ఆ – చాలామందికి తెలుసు. ఇరవై ముప్ఫయి సంవత్సరాలకితం క్రెంచి మన స్తత్వవేత్త రిబాట్ అనే ఆయన యీ విషయం వెల్లడించాడు. దీన్ని ఆయన ఉద్వేగస్మృతి అన్నాడు.

కిన్నెర : అదెలా పనిచేస్తుంది ?

నేను : మానవజీవితంలో వ్యక్తమయే సకల విషయాల ద్వారా, ఆ విషయాల అనుభూతిద్వారా పనిచేస్తుంది

కిన్నెర : ఉదాహరణకి ఒకటి చెప్పండి.

నేను : విను. ఒక పట్టణంలో ఒక భార్యా, భర్తా వుండేవారు. వాళ్ళిద్దరూ చిన్నప్పటినుంచీ ఒకే క్లాసులో చదువుకున్నారు. ఒకరిమీద ఒకరికి ప్రేమ కలిగింది. ఒక రోజున మంచి లడ్డూలు కొనుక్కొని, వాటి తీయదనం, తీయని వాసనా అనుభవిస్తూ ఆనందంతో కిలా కిలా నవ్వుకుంటున్న సమయంలో ఒకరిమనసు ఒకరు విప్పి చెప్పుకుని పెళ్ళిచేసుకుందా మనుకున్నారు. అలాగే ఒక నెలతర్వాత వారి వివాహం అయింది. పెళ్ళిభోజనాలలో లడ్డూలు వడ్డించారు.

సంవత్సరాలకి సంవత్సరాలు గడిచిపోయాయి. సంతానం కలిగింది. సంసారపుచిక్కులు వచ్చిపడ్డాయి. సామాన్యంగా అందరి దంపతుల్లాగానే వారిమధ్య కూడా పొలఅలకలు, చిన్నచిన్న తగాదాలు బయలు దేరాయి. ఒక్కొక్కప్పుడు ఒకరితో ఒకరు మాట్లాడుకో

కుంటా మాతులుముడుచుకుని కూర్చునేవారు. పరిస్థితి యిలా వుండగా వాళ్ళపెద్దకూతురు వీళ్ళిద్దరికీ లడ్డూలంటే మహాయిష్టమని కనిపెట్టింది. తలిదండ్రులు తగాదా పడ్డప్పుడల్లా లడ్డూలుతెచ్చి వాళ్ళముందు పెట్టేది. ఆ లడ్డూలు చూసేసరికి వాళ్ళ పొలఅలకలు, కోపతాపాలూ యేమయ్యేవో? కిలకిలా నవ్వుకుంటూ కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ ఆలడ్డూలుతినేవారు. లడ్డూలంటే వాళ్ళకుండే మక్కువమూలంగానే క్షణంలో యీ మార్పువచ్చివుంటుందని ఆఅమ్మాయి అనుకుంది. నువ్వేమనుకుంటున్నావు?

కిన్నెర : బాహ్యపరిస్థితులు ఆంతరంగిక భావాలను తిరిగి మేల్కొల్పాయి.

నేను : ఊహుఁ– భావాలను మేల్కొల్పటంగాదు, వారికి తెలీకుండానే కాలానికీ, కోరికలకీ, హేతుమత్వానికీ అతీతులై పూర్వపు – మొదటగా లడ్డూలుతిన్ననాటి– మనుషులైపోయారు.

కిన్నెర : వారికి తెలీకుండా యేంకాదు. ఆ లడ్డూలు వారిలో ఎలాంటిభావాలు రగుల్కొల్పుతాయో వారికితెలుసు.

నేను : యేపాతికేళ్ళో అయింతర్వాతనా? యేమోనబ్బా! వారు సామాన్య మనుషులు. వారిభావాలు యెలా ఆవిర్భవించాయో పరిశోధించుకుంటూ రనుఁకోనుఁ. సహజంగా జనించిన భావాలకి వారు లొంగిపోయారు. వారి ప్రకృతి ప్రస్తుతభావాలకంటెబలీయమైంది. ఒకటి రెండు, మూడు, నాలుగు అని లెక్కబెడుతూ చటు

కక్కన ఆపేయటం చాలాకష్టం. మళ్ళీ మొదటికి రావాల్సివుంటుంది.

కిన్నెర : నేను మళ్ళీ మొదటికి...

నేను : ఆ—తప్పకుండాను.

కిన్నెర : నాలో అటువంటి పూర్వస్మృతులు దాగివున్నా యంటారా ?

నేను : ఓ— కావలసినన్ని పూర్వస్మృతులు నీలో నిద్రాణమై వున్నాయి. యెపుడు మేల్కొల్పుతావా, యెప్పుడు పిలుస్తావాఅని నిరీక్షిస్తున్నాయి. వాటిని మేల్కొల్పితే నీ గుప్పిటలో పెట్టుకోవచ్చు. వాటిని వుపయోగించుకోవచ్చు నీవృత్తికి వాటిని అన్వయించవచ్చు. కళ అనే మాటకంటె వృత్తి అనేమాట యిక్కడ వాడటం మంచిది. అనుభవంలోవుండే రహస్యమంతా ఆకళింపుచేసుకోవచ్చు.

కిన్నెర : రంగస్థలం అనుభవంలోని రహస్యంమట్టుకు కాదు.

నేను : పరోక్షంగా అంతే. వృత్తప్పుడుకంటె చెప్పడానికి యేదైనా వున్నప్పుడు అనుభవం ఎక్కువ తొందరగా వస్తుంది. అనుభవం సంపాదించుకోవాలంటే యత్నం చేసినప్పుడుకంటెకూడా—అంటే'బిగ్గరగాపాట్టుచెప్పటం', 'సంవేదనపడటం' మొదలైన సమయాలలోకంటె అనుభవం యెక్కువ తొందరగావస్తుంది. ఈ యత్నాలన్నీ చిన్నపిల్లలు చేసేవి.

కిన్నెర : ఆ పూర్వస్మృతులను నా పాత్రకి అన్వయించటమెలా ? వాటిని శాసించటం యెలా ?

నేను : అదీ అసలువిషయం. ఒకేసమయంలో సంతోషం, విచారంలాంటి రెండు పరస్పర విరుద్ధభావాలు యెప్పు డైనా అనుభవించావా?

కిన్నెర : ఆ—చాలాసార్లు అనుభవించాను. కాని వాటిని తిరిగి యెలా జ్ఞాపకం తెచ్చుకోవాలో తెలీటంలేదు. అలాం టప్పుడు నేను యెక్కడున్నానో, యేం జేస్తున్నానో జ్ఞాపకంరావటంలేదు.

నేను : 'యెక్కడవున్నాను? యేం జేస్తున్నాను' అనే విష యాలు అలావుంచు. నువ్వుఅప్పుడున్నస్థితికి తిరిగివెళ్ళటం, నీస్వత్వాన్ని శాసించటం, వెళ్ళదలచిన అవస్థకు వెళ్ళటం, అలా వెళ్ళినతర్వాత అక్కడే స్థిరంగావుండి పోవటం,యివీ ప్రధానమైనవి. ఆపరస్పరవిరుద్ధభావాలు రెండూ ఒకేసారి నువ్వు అనుభవించిన ఘట్టం యేదైనా చెప్పు చూద్దాం.

కిన్నెర : నా జీవితంలో మొదటిసారిగా కిందటి వేసంగిలో బెంగుళూరు వెళ్ళాను. మాతమ్ముడు నాతో కూడా రావటానికి వీలులేకపోయింది. నేను వెడుతూంటే సాగ నంపటానికి రైలుదాకా వచ్చాడు. బెంగుళూరు వెడు తున్నాననే సంతోషం, పాపం, మా తమ్ముడు నాతో రావటానికి వీల్లేకపోయిందే అనే విచారం ఈ రెండూ నన్నావహించాయి. కాని అప్పుడు నే నెలా ప్రవర్తిం చానో నాకు జ్ఞాపకం రావటంలేదు.

నేను : సరే—అదంతా యెలా సంభవించిందో చెప్పు. నువ్వు యింటిదగ్గిర బయలుదేరిన క్షణంనుంచీ జరిగిందంతా

చెప్పు. ఒకముక్క అయినా వదలిపెట్టకు. బండివాడెలాఉన్నాడు ? బండిలోకూర్చుని వెళ్తుంటేయెలాంటి భావాలు నీలో రేకెత్తాయి ? వాతావరణం యెలావుంది ? ఆకాశంరంగు యెలావుంది ? స్టేషనులో కూలీలు, ప్రయాణీకుల హడావిడి అంతా పూసగుచ్చినట్టు వర్ణించు. ఏవిషయం మాత్రం మరిచేపో. బాహ్యవిషయాలతో ముందు ప్రారంభించు. నీవెలాంటి చీర కట్టావు ? నీ తమ్ముడెలాంటి దుస్తులు వేసుకున్నాడు ? ఊఁ- చెప్పు.

కిన్నెర చెప్పటం మొదలెట్టింది. ఏకాగ్రతను బాగా అభ్యసించిందేమో వెంటనే మనసును అసలు విషయంమీదికి పోనిచ్చింది. సి.ఐ.డి. వాళ్ళకి పాఠాలు నేర్పగలదు. ముఖంలో ఏమాత్రం చలనంలేదు నిబ్బరంగా నిలుచుంది. ప్రతిమాటా తూచి తూచి చెబుతోంది. వివరాలు ఏమీ వదిలివేయడం లేదు. అర్థంలేని మాటలు వాడటంలేదు. అవసరమైన విషయాలు మాత్రమే చెబుతోంది. మొదట యంత్రం మాట్లాడినట్లుంది. తర్వాత బండీని ఒక పోలీసు ఆపి గొడవ చేస్తుంటే "ఆలస్యం అయిపోయింది. యిక వదిలేద్దూ," అనేటప్పుడు మొదటిసారిగా కిన్నెర కళ్ళల్లో ఉద్వేగం ద్యోతకమైంది. 'ఆనాటి మనిషి' అయిపోయింది. అభినయించటం ప్రారంభించింది. కాని చాలా కష్టపడాల్సివచ్చింది. చాలాసార్లు మళ్ళీ వెనక్కి వెళ్ళి వాస్తవ విషయాలు చెప్పసాగింది. కాని క్రమేపీ వాటి ప్రాధాన్యత తగ్గిపోతోంది. చివరికి రైల్వేప్లాటుఫారం నుంచి రైలుపెట్టెమెట్లమీదికి ఎలా ఎగిరిందో చెబుతూ

అనుకోకుండానే ఎగిరిచూపింది. హఠాత్తుగా మొహం వెనక్కి తిప్పింది. వెనకాల దగ్గిరలోనే వాళ్ళతమ్ముడు బిక్క మొహం వేసుకుని నిల్చునిఉన్నాడు. ఆమెకి కన్నీళ్లు జలజలా రాలాయి. వాటిని అరికట్టేయాలని యత్నించింది.

"అదేవిటి తమ్ముడూ, బెంగెట్టుకోకు. నేను తిరిగివచ్చిం తర్వాత బెంగుళూరు విశేషాలన్నీ నీకు చెబుతా. అందరికీ నా నమస్కారాలందజెయ్యి. యిక్కడనుంచి వెళ్ళడమంటే నా మనసు గింజుకుంటోంది. యేం లాభం? తీరా టికెట్టు కొని రైలు యెక్కింతర్వాత. అయితేనేం బెంగుళూరులో మహా కులాసాగా వుంటుంది..."]

నేను : ఆగు. యిక నువ్వు వేషంమీద చెప్పాల్సిన మాటలు చెప్పు. ఈ ఉద్వేగం తగ్గిపోకుండా చూసుకో. సరిగ్గా యిప్పుడున్నట్లు, మీ తమ్మునితో మాట్లాడుతున్నట్లు మాట్లాడు. నువ్విప్పుడు వేషంమీద యెలా వుండాలో అలానే వున్నావు.

కిన్నెర : కాని నాటకంలో నేను తల్లితో మాట్లాడాలి.

నేను : ఆమె నిజంగా మీ అమ్మేనా?

కిన్నెర : కాదు.

నేను : లేనివాటిని వున్నట్లుగా చూపించేదే నాటక రంగం. రంగస్థలంమీద ప్రేమ చూపుతున్నావంటేనువ్వునిజంగా ప్రేమిస్తున్నట్టా? ఆలోచించు. నాటక రంగంమీద జరిగే సంఘటనలు యదార్థంకావు. వాటిని సృష్టించి చూపుతున్నాం. అంతే. ఆసృష్టివాస్తవికంగావుండాలి. అక్కడవుండాల్సిన వాస్తవికత అదొక్కటే. పరస్పర

విరుద్ధభావాలను నువు అనుభవించి వుండటం యీనాడు ప్రత్యక్షంగా తటస్థించింది. నీ ఆత్మశక్తితోను, నీవృత్తిలో నీకుండే పరిజ్ఞానంతోనూ నువ్వు ఆ అనుభవాన్ని సమీకరించి తిరిగీ సృష్టించావు. ఆఅనుభవం యిప్పుడు నీ గుప్పిటలో చిక్కింది. ఆ అనుభవానికీ, నీ సమస్యకీ సారూప్యత వుందనీ, ఆ అనుభవం నూతన్న సృష్టికిఉపకరిస్తుందనీ నీ కళా పరిజ్ఞానంవల్ల తోస్తే దానిని వుపయోగించుకో. అనుకరణ సరైనమార్గంకాదు. సృష్టించటమే సరైనమార్గం.

కిన్నెర : మీ మాటలు వింటూ, పునస్సృష్టిలోని ప్రధాన క్రమ విధానం మర్చిపోయాను. నా కథ మళ్ళీ మొదలు పెట్టమంటారా ? మళ్ళీ ఆ విరుద్ధ భావస్థితికి వెళ్ళమంటారా ?

నేను : నువు జ్ఞాపకం పెట్టుకోవలసిన పాటను యెలావింటావు ? చిత్రకళలో నువు వుపయోగించ దలచిన రంగులను కలపటం యెలా నేర్చుకుంటావు ? నిర్దుష్టంగా పట్టుబడే వరకు తిరిగితిరిగి సాధన చెయ్యటం ద్వారా కాదూ ? ఒక్కమాటు వింటేచాలు. యెలాంటిదైనా కొందరికి జ్ఞాపకం వుంటుంది. మరికొందరికి రెండు మూడు సార్లు వింటేనే గాని జ్ఞాపకం వుండదు. చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారు ఒక్కమాటు పద్యం వింటే తిరిగి వప్పగించేవారు. మళ్ళీ యెన్ని సంవత్సరాలకైనా కావాలంటే ఆ పద్యం వప్పగించేవారు. 'అభ్యాసం కూసు విద్య' అనే ముక్క యెప్పుడూ వినాలా ? ఒక ఉదాహ

రణ చెప్పాను. నీచుట్టూ, నీలో వందలకొలది విష యాలు లభిస్తాయి. వాటిని అభ్యసించు. మరచిపోయిన వాటిని తిరిగీ జ్ఞాపకం చేసుకోవటం యెలాగో నేర్చుకో. తిరిగి వాటిని సరిగా వున్నవి వున్నట్లు స్మృతికి తెచ్చు కోవటం నేర్చుకో. వాటిని సద్వినియోగం చెయ్యి. మొదట యిదంతా పట్టు పడటానికి చాలాకాలం పడు తుంది. చాలాకృషి చేయాల్సి వుంటుంది. విషయం అతి సున్నితమైంది. మార్గం గోచరించినట్టే గోచరించి మాయమవుతుంది. నిరుత్సాహపడవద్దు. 'యద్భావం తద్భవతి' అన్నారు పెద్దలు. యిది జ్ఞాపకం వుంచుకో. నటుని ప్రాథమిక ప్రక్రియ 'బుద్ధిపూర్వకంగా యేది కావాలని కోరతావో అది సరిగ్గా అయిపోవటం.'

కిన్నెర : నా విషయంలో, నాకు దొరికి మాయమైపోయిన మార్గం తిరిగి కనుక్కోవటం యెలాగో చెబుతారా ?

నేను : ముందు నువ్వు ఒంటరిగా కృషిచెయ్యి. నీకు మార్గం చూపటానికి నేను చెప్పవలసిందంతా చెప్పాను. యిక నువ్వు ఒంటరిగా, పూర్తిగా 'నీలో'నే అభ్యాసంచెయ్యి. యెలాగో నీకు తెలుసుగా. ఏకాగ్రతద్వారా, ఆ విరుద్ధ భావాలు కలిగిన క్షణాన్ని చేరుకోటానికి మార్గం అన్వేషించు. అప్పుడు ఆ విరుద్ధభావాలు యెప్పుడు, యెలా కలుగుతాయో నీకే బోధపడుతుంది. సరిగా కృషిచేస్తే ఆ భావాలు నీకు కలుగుతాయి.

సమర్థులైన నటులందరూ తమకు తెలీకుండానే యీ పనిచేస్తారు. క్రమేణా నీకూ యిది అలవరచు

కోటానికి అట్టేకాలంపట్టదు. వెనక యెప్పుడో విన్నపాట జ్ఞప్తికి తెచ్చుకోటంలావుంటుంది. చివరికి ఒక్కమాటు భావనాశక్తి తళుక్కుమంటేచాలు. వివరాలు వది లేస్తావు. ఒక నిర్దిష్టలక్ష్యంతో అంతటినీ నీలో నిర్వ చించుకుంటావు. అభ్యాసంచేస్తే వ్యూరికే అలా తలుచు కునేసరికల్లా నువ్వు యేం తలుచుకుంటె అదైపోతావు. ఏ అవస్థలోకి వెళ్ళాలనుకుంటే ఆ అవస్థలోకి వెడ తావు, అప్పుడు రచయిత రాసినమాటలు వుపయో గించు. నువ్వు సరైనమార్గమే తొక్కివుంటే ఆమాటల్లో యెప్పటికప్పుడు జీవం వుట్టిపడుతూ కొత్తవిగా విని పిస్తాయి. నువ్వు వాటికోసం బాధపడనక్కరలేదు. వాటిని సమీకరిస్తేచాలు యెంతో సహజంగావుంటాయి. కాని ఉద్వేగ ప్రదర్శనానికి అనువైన అంగసౌష్టవం వుండాలి అంతే.

కిన్నెర : సంవేదనలను యెంచుకోవటంలో తప్పటడుగు వేస్తే యేం చెయ్యాలి ?

నేను : నువ్వెప్పుడైనా చిత్రకారులు రంగులు కలుపుకుంటుంటే చూచావా ? తానూహించిన వర్ణమిశ్రమం లభించే వరకు అనేకమాటులు రకరకాలుగా రంగులు కలుపు తారు. అంటే అనేకసార్లు తప్పులు దిద్దుకుంటారు. యిక నువ్వుమాత్రం ?

కిన్నెర : నేను స్టేజీమీద ప్రదర్శించాల్సిన సంవేదనలాంటిది నా జీవితంలో అనుభవించి వుండకపోతే ? అప్పుడు యేం చెయ్యాలి ?

నేను : అసంభవం! నీ మనసు సున్నితమైనదై, నువ్వు మామూలు మనిషివైతే నీముందు సుపరిచితమైన విశాల ప్రపంచం వుంది. కవులు, నాటకకర్తలుకూడా మనుషులే వారి జీవితాలలో కళకు వుపకరించే ఘట్టాలు, సంవేదనలు వుంటే నీ జీవితంలో మాత్ర మెందుకుండవు? నీ భావనాశక్తిని వుపయోగిస్తే నువ్వు అన్వేషించేది నీ కాళ్ళముందుకే వచ్చిపడుతుంది.

కిన్నెర : సరే. నేను స్టేజిమీద హత్య చెయ్యటం అభిన యించాలనుకోండి. మరెలా.

నేను : మీకందరికీ ఒక జబ్బు. హత్యను అభినయించాలని సర్దా. యీ ప్రశ్న నన్నెనకమంది వేశారు. సరేకాని నువ్వెప్పుడూ హత్యచెయ్యాలా!

కిన్నెర : ఊహుఁ—

నేను : మీ యింటో దోమలు వున్నాయా?

కిన్నెర : ఆ—

నేను : అవెప్పుడూ నిన్ను కుట్టలా? దోమని చేతిమీదినో వీపుమీదినో రానిచ్చి, నీకు దెబ్బ తగులుతుందేమో ననైనా ఆలోచించకుండా ఆ దోమ వాలినచోట ఫెడీ మనీ కొట్టుకోలా? అలా కొట్టుకోవటంలో నీ ఉద్దేశ్య మేమిటి?

కిన్నెర : వాటిని చంపాలని.

నేను : యింకేం అందుకున్నావు. హత్యసీను యాక్టు చెయ్య డానికి యీ మాత్రం గ్రహింపువుండి భావనాశక్తి, ఆత్మవిశ్వాసం వుంటే చాలు.

కిన్నెర : మీరు చెప్పిన 'ఆనాటి మనిషి అయిపోవటం' అన్వయించటానికి వీల్లేని ఘట్టాలు నాటకంలో వుంటే యేం చెయ్యాలి ?

నేను : ప్రతి ఘట్టానికి అది అన్వయించాలి. కాకపోతే అతి అన్వయింపు పనికిరాదు. అంగ విన్యాసం ద్వారా భావం వ్యక్తీకరించగలిగినప్పుడు ఆ 'అయిపోవటం' కోసం అన్వేషించకు. నీస్వత్వాన్నే మరిచిపోయేటంత చిత్తశుద్ధితో అభినయించ తలచి, శిల్పాన్ని పెంపొందించుకుంటే యేచెత్తయినా యిట్టే అభినయించవచ్చు. యిదంతా ఒకప్పుడు విన్న పాటను తిరిగి జ్ఞాపకం చేసుకోటం లాంటిది. పాత్రాభినయంలోని క్లిష్టస్థలాలు గుర్తించుకొని వాటినిలా శ్రద్ధతో సాధన చెయ్యాలి. ప్రతి నాటకంలోనూ ప్రేక్షక హృదయాలను రంజింపజేసే రసవత్తర ఘట్టాలు ఒకటో రెండో వుంటాయి. ప్రేక్షకులు టిక్కెట్లు కొనుక్కునేది ఆ ఘట్టాలు చూట్టానికే. వాటిమీద నీశక్తి సామర్థ్యాలు కేంద్రీకరించాలి.

ఉదాహరణకు—రామదాసు నాటకం తీసుకుందాం. ప్రేక్షకులు టిక్కెట్లు కొనుక్కుని వచ్చేది జైలుసీను చూట్టానికి. నాటకం యెంత విసుగెత్తించినా ఆ సీను కోసం కాచుక్కూచుంటారు. ఆ నాటకంలోని రసవత్తరఘట్టం అదే. ఆసీను తగలపడి పోయిందా నటుడు ప్రేక్షకుల మెప్పు పొందలేడు. అంతకుముందు సీను

లలో యెంత బాగా అభినయించినా బూడిదలో పోసిన పన్నీరవుతుంది. అలాగే హరిశ్చంద్రలో కాటిసీను.

కిన్నెర : ఆ - నా వేషంలో అలాంటి రసవత్తరఘట్టాలు మూడున్నాయి. పొరపాటు యెక్కడుందో యిప్పుడు గ్రహించాను. ఆ మూడుఘట్టాల్లో తక్కివచోట్లకంటె నేర్పుతో నేను అభినయించలేదు. అందుకనే నా వేషం విసుగుపుట్టించింది. యిక ఆ ఘట్టాలలో ఆ పాత్రనైపోతాను. అప్పుడు సవ్యంగా అభినయించగలుతానా ?

నేను : ఓ-తప్పకుండా. నాలుగురోజులు పోయాక మళ్ళీ యింకేదో సమస్య తీసుకు వస్తావు.

కిన్నెర : వట్టి తెలివితక్కువపని చేశాను. ముందే మీ దగ్గిరికి రావల్సింది.

నేను : ఊహుఁ-నీ శిల్పానికి పునాదులు పడటానికి సంవత్సరమైనా పడుతుంది. వేషం వేయటానికి కావలసిన శక్తి నీ కిప్పుడు లభించింది. యిప్పుడు నీకు చెప్పింవె సంవత్సరం క్రితమే చెప్పివుంటే అప్పుడు నీకు అర్థమయేది కాదు. మళ్ళీ నాదగ్గిరికి వచ్చేదానివి కావు. నీ స్వభావానికి అనుకూలంగాని వేషం వేయాల్సివచ్చినప్పుడు మళ్ళీ వస్తావు.

సరే. యిక వెళ్ళు. బాగా అభ్యాసం చెయ్యి. వుత్సాహంగా వుండు. అభినయించటానికి నీకు మంచి వేషం దొరికింది. ఆ 'లడ్డూ' లను మాత్రం మర్చిపోకు. నీ చుట్టూవున్న ప్రతీదీ గమనించు. జీవితం

లోని రసవత్తర విషయాలను, జీవిత ప్రపూర్ణతను పోగుచేసుకుని నీ మనసులో ప్రతిష్ఠించుకో. వాటిని ఒక క్రమంలో అట్టేపెట్టుకో. వాటి అవసరం నీ కే క్షణంలోనైనా రావచ్చు. నీ వృత్తిలో నీ కవే స్నేహితులు, ఉపాధ్యాయులు. అవే నీ రంగులు, కుంచెలు. నీకు మేలుచేకూర్చేవి. అవి నీ స్వంతఆస్తి. అనుకరణలుకావు. అవి నీకు అనుభవం, శక్తి, పొగరితనం, ఖచ్చితత్వం ప్రసాదిస్తాయి.

కిన్నెర : నమస్తే, కృతజ్ఞురాల్ని.

నేను : నువ్వు యీతడవ వచ్చేటప్పుడు నువ్వు తలచుకున్నప్పుడు 'ఆనాటి మనిషి'వి అయిపోయిన ఘటనలు వందన్నా చెప్పాలి.

కిన్నెర : పర్వాలేదు. యీతడవ నేను వచ్చేటప్పుడు ... ... ఆ 'లడ్డూ'ల సంగతి బాగా తెలుసుకుని మరీవస్తాను.

[కిన్నెర ఉత్సాహంతో వెళ్ళిపోయింది.]

"విద్యయొక్క ఆశయం నేర్చుకోవటం కాదు. అందులో జీవించటం", అన్న మాటలు నాకు జ్ఞాపకం వచ్చాయి.



# 3. ప్రక్రియ

[నేనూ కిన్నెరా పార్కులో పచార్లుచేస్తున్నాం. కిన్నెర కోపంతో చిందులు తొక్కుతోంది. ఒకటాకీలో ఆమె వేషం వేస్తోంది.]

కిన్నెర : ......ఆపట్న ఆపేశారు. గంటన్నర శివజాగరణ చేశాం. తర్వాత మళ్ళీ ప్రారంభమైంది. యీతడవ ఓ పెద్దసీనులోది మూడుపంక్తులు, మూడంటేమూడు పంక్తులు షూటుచేశారు. మళ్ళీ ఓగంట జాగరణ. అబ్బా! నేనాబాధ పడలేను. కెమెరా, లెన్సులు, మైకులు, సెట్టింగు వీటికీ టాకీలలో ప్రాధాన్యం. యాక్టర్ల బాధలు యెవడికావాలి. యిక నటన యెలావున్నా తోసుకుపోతుంది.

నేను : అయినప్పటికీ కొంతమంది అక్కడక్కడా గొప్ప నటనా చాతుర్యం ప్రదర్శించినవారు లేకపోలేదు.

కిన్నెర : యెప్పుడో అపురూపంగా ఓ అయిదు సెకండ్లపాటు వారి చాతుర్యం కనిపిస్తుంది. అంతే.

నేను : అయిదు సెకండ్లయినా దానికోసం అన్వేషిస్తే నువ్వనుకున్నంత అపురూపమేంకాదు.

కిన్నెర : మీరు – నాటకరంగం జీవకళతో వుట్టిపడుతుండాలని ప్రబోధించే మీరు – యీ ముక్కయెలా అనగల్గారు? అసలు సినిమాలో రసవద్ఘటన కనిపిస్తుందా? అథవా

యెప్పుడైనా కనిపించినా భిన్నాభిన్నంగా వుంటుంది. తెలాత్తో కా వుండదు. అటువంటి ఘటనలను మీరెలా సమర్థిస్తారు ?

నేను : నీకిదివరకు సాయం చేశానా ?

కిన్నెర : ఆ –

నేను : యిప్పుడుకూడా అక్కు ప్రశ్నలు వేయకుండా విను. అజంతా చిత్రాలు యెప్పుడైనా చూశావా ?

కిన్నెర : ఆ –

నేను : వాటిమీద నీ అభిప్రాయమేమిటి ?

కిన్నెర : ఓ – గొప్పగావున్నాయి. సౌందర్యం వుట్టిపడుతూంటుంది. నేటి గొప్పగొప్ప చిత్రకారులచిత్రాలలో వాటి ఛాయలు కనిపిస్తాయి. ఆచిత్రకారులు యెవరండీ?

నేను : యెవరో ? వారిపేర్లను లోకంమర్చిపోయింది. వారు కొన్ని శతాబ్దాలక్రితం స్వర్గస్థులయారు.

కిన్నెర : అలానండీ ! వారు తమ కళాచాతుర్యానికి శాశ్వత రూపం యివ్వడం బలేగావుంది. ఆ చిత్రాలద్వారా మానవుని సృజనాత్మక శక్తిని గ్రహించవచ్చును. నేటి చిత్రకారుల కళకు ప్రాతిపదికను వూహించవచ్చు.

నేను : అవును. అంతేగాదు హరిప్రసాదరావు హరిశ్చంద్ర కాటిసీనులో "అహా ! సురాభాండమా ?" అంటూ అభినయించటం తిరిగీ తిరిగీ చూడాలనిపిస్తుంది బళ్లారి రాఘవాచారి రామదాసు జైలుసీనులో "కరిని కాచిందికల్ల, పాండవుల పాలించింది పొల్లు" అని రాముణ్ణి దుయ్యబట్టే ఘట్టం యెన్నిమార్లుచూస్తే

మట్టుకు తనివితీసుతుంది ? నేను ఓసారి రాఘవాచారి అభినయ విశేషాలు వర్ణించాలనుకున్నాను. కాని లాభం లేకపోయింది. మాటలుచాలలేదు. అజంతా చిత్రాలలో ఆ చిత్రకారుల ప్రతిభ గోచరిస్తుంది. కాని యే హరిప్రసాదరావు నటనాకౌశలమో మళ్ళీచూద్దా మంటే యెలా ?

కిన్నెర : అవును నిజంగా అది మన దౌర్భాగ్యమే.

[ఒక నిమిషం ఆగి కొద్దిగా విచారపడి మళ్ళీ మంద హాసం చేస్తూ అంది.]

కిన్నెర : ఊ – నేను మీాకీవిషయం స్ఫురణకు తెచ్చినట్టు న్నాను.

నేను : అవును. నువ్వెప్పుడూ యిలాంటి విషయాలు స్ఫుర ణకు తెస్తూంటావు. కాని నేను యే విషయాలూ కొత్తగా సృష్టించను. ప్రకృతిలో వున్నవాటిని పరిశీ లించి నీకు అందజేస్తుంటాను. నువు వాటినుంచి నిర్ణ యాలు తీసుకుని లాభం పొందు. కళలో యదార్థ మైన నియమాలు మనంతట మనం యేర్పరచుకున్న నియమాలే

కిన్నెర : మహానటుల అభినయపద్ధతులు, వారి గాత్రం తర తరాలకూ అందజేయడానికి వీల్లేకపోయిందని తెలుసు కున్నాను. అందువల్ల వారి కళాకుశలత చూసేభాగ్యం లేక యీ టాకీలలో మహావస్థ పడుతున్నాను.

నేను : అదేంకాదు. కాలానికి ముందడుగువేసి, శక్తివంచన లేకుండా పాటుపడితే నీ కేమాత్రం అవస్థవుండదు.

కిన్నెర : అసంభవం!

నేను : అసంభవంకాదు. తప్పనిసరి.

కిన్నెర : మీదంతా వట్టి భ్రమ ?

నేను : భ్రమకాదు. మీరదృష్టితో ఆలోచించక పోవటం.

కిన్నెర : ఆయంత్రభూతంమీద నాస్వభావం తిరగబడుతోంది.

నేను : అయితే నువ్వు వేషం వెయ్యడానికి పనికిరావు.

కిన్నెర : నా ఆవేశానికీ, నా సృజనాత్మక కృషికీ స్వేచ్ఛ కావాలి. అడ్డంకులు పనికిరావు.

నేను : నాటకకళా పరిణామంలో ఒకొత్త వుపకరణ మన కిప్పుడు లభ్యమైంది. అనాదినుంచీ తక్కిన లలితకళ లన్నిటికీ యీ వుపకరణవుంది. నేటివరకు నాటకకళ ఒక్కదానికే యిది లోపించింది. యీ వుపకరణ నాటకరంగానికి ఖచ్చితమైన పంథాని ప్రసాదిస్తుంది. చిత్రలేఖనంలో ఖచ్చితమైన వర్ణమిశ్రమంలాగా, శిల్పంలో ఖచ్చితమైన ఆకృతిలాగా, కవిత్వంలో ఖచ్చితమైన మాటల్లాగా అభినయంలో కూడా ఖచ్చితత్వాన్ని అలవర్చుకోమని సినీమా కోరుతుంది.

కిన్నెర : నెల తిరిగేసరికి యెన్ని చెత్తసినిమాలు తయారవుతున్నాయో ?

నేను : అనాదినుంచీ యెన్ని వెధవచిత్రాలు రాలేదు, యెన్ని చవకబారు పుస్తకాలు రాలేదు ? మంచివేవో నిలిచాయి. తక్కినవి కాలగర్భంలో లీనమైపోయాయి.

కిన్నెర: నూరు చెత్తసినిమాలు వచ్చినా ఒక్క మంచిసినిమా వస్తే చాలునంటారా ?

నేను : సినిమా అనే భావమే అమూల్యమైంది. సినిమాలో నటుని అభినయం శాశ్వతరూపం పొందుతోంది. ఒకే సారి బొమ్మ, గొంతు, గమనం తద్వారా నటుని భౌతిక ఆకృతి, హృదయం రికార్డు చెయ్యటమనేది వచ్చిన తర్వాత నాటకకళ ఆరాత్రికి ఆరాత్రే అంత రించక శాశ్వతరూపం తాలుస్తోంది. యిక నటుడు తన అభినయసృష్టి కార్యక్రమాన్ని ప్రేక్షకులముందు సాగించనక్కరలేదు. యిందులో నటునికి ప్రేక్షకుల బాధ వుండదు. ఫలితమే పరిశీలనకు వస్తుంది.

కిన్నెర: ఆ కెమెరా మొదలైన యంత్రాలముందు నటునికి స్వేచ్ఛ వుండదు. ప్రతి రంగాన్ని ముక్కలు ముక్క లుగా చేస్తారు. నటుడు మాట్లాడే మాటలకి అంతకు ముందు మాట్లాడినవాటికి, ముందు మాట్లాడవలసిన వాటికీ సంబంధం వుండదు.

నేను : కవిరాసే మాటలకి ఒకదానితో ఒకదానికి సంబంధం వుండదు. ఆ మాటలన్నీ కలిపి గుదిగుచ్చినప్పుడే వాటికి విలువ వస్తుంది.

కిన్నెర: కాని నటుడు తాను ధరించే పాత్రయొక్క అవస్థా క్రమాన్ని అనుసరించేదెలా? ఉద్వేగాన్ని సృష్టించు కుంటూ వెళ్ళి వెళ్ళి స్థాయికిచేరి ఆ పాత్రకి రస వ్యాఖ్యానం చేయటం యెలా?

నేను : యెలాగేమిటి? నాటకరంగంలో లాగానే. నాటకాల్లో ఒకటి, రెండు వేషాలు బాగా నటించినంతమాత్రాన

యిక నేర్చుకోవలసిందేమీ లేదనుకున్నావా? శిల్పం అభివృద్ధి పర్చుకోనక్కర లేదనుకున్నావా?

కిన్నెర : నేర్చుకోవాల్సిందివుందనుకోకపోతేమీదగ్గిరి కెందుకు వస్తాను?

నేను : అయితే టాకీలో నువు పడుతున్న చిక్కేవిటి?

కిన్నెర : సీను మధ్యలో ప్రారంభించమంటారు. తీరా ప్రారంభించాక నాలుగయిదుపంక్తులు షూటుచేస్తారు. మళ్లీ ఓ గంట గోళ్ళుగిల్లుకుంటూ కూర్చోవాలి. తర్వాత యింకెక్కడనించో మొదలు పెడతారు. యీ రెంటికీ యేమీ సంబంధంవుండదు. అక్కడిదోసీను, యింకెక్కడిదో ఓ సీను మళ్ళీ నాలుగు పంక్తులు నటించటం తర్వాత మళ్ళీ ఓ గంట జాగరణ. తలాతోకావుండదు. ఘోరం!

నేను : శిల్పంలో లోటు... అంతే.

కిన్నెర : అంటే?

నేను : ప్రక్రియానిర్మాణం. ఈ ప్రక్రియనే అంతిమలక్ష్యంగా పెట్టుకుని రచయిత మాటలలో దీనిని పొదుగుతాడు. దీనినే నటుడు రంగస్థలంమీద అభినయిస్తాడు.

కిన్నెర : అలా సినీమాలో అభినయించటం సాధ్యంకాదు. నా వేషానికి రెండున్నర పేజీల లవ్ సీను వుంది. ఆసీను అభినయిస్తూంటే పదకొండుసార్లు ఆపుజేశారు. రోజల్లా ఆ సీను తీయటానికేపట్టింది. నను ప్రేమించినవానికి నేనూ అతన్ని ప్రేమిస్తున్నానని నమ్మకం కలిగేటట్టు ఆ సీనులో నేను నటించాలి.

నేను : యిదంతా రెండుపేజీలు! ఒక్క పంక్తిలో నువ్వు నచ్చేటట్టు చెప్పావ్. తక్కినపార్టు అప్పుడుయేంజేశావు?

కిన్నెర : అదేవిధంగా అభినయించాను.

నేను : రెండున్నరపేజీలు! ఒక్కవిధంగానే అభినయించావా? అందుకే అన్నిసార్లు అప్పుజేశారు.

కిన్నెర : అదీ అక్కడ అభినయించాల్సింది. అంతకంటె వేరే యేవుంది?

నేను : ఆ చెట్టుకేసిచూడు. సకలకళలకూ అది మూలకందం. ప్రక్రియా నిర్మాణానికది ఆదర్శం. పైకి సూటిగా ఎదగడం. యిరుప్రక్కలా పెరగకుండా కుదించుకోవటం, కుదిమట్టంగా పెరగటం. ఆప్రకాండంచూడు నిటారుగా, సాపేక్షంగా, తక్కినభాగాలతో సామరస్యం కలిగి వాటన్నిటికీ ఆధారభూతమైవుంది. చెట్టు కంతటికీ నాయకత్వం వహించేదిదే. గీతంలో కవి భావంలాంటిది. నాటకంలో డైరెక్టరు ప్రక్రియాభావం వంటిది.

కిన్నెర : నాటకప్రదర్శనంలో యీ ప్రక్రియను డైరెక్టరు యెలా వ్యక్తీకరిస్తాడు?

నేను : రసవ్యాఖ్యానంద్వారా. ఆ వ్యాఖ్యానమును సముపార్జించిపెట్టే చిన్నచిన్న, అప్రధానప్రక్రియలద్వారా.

కిన్నెర : ఉదాహరణకు ఒకటి చెప్పండి.

నేను : సారంగధరనాటకం తీసుకుంటే కన్పించేదిసారంగధరుని మీద చిత్రాంగివలపు. యిదేయింకోదృష్టితోచూస్తే వివేకం గోల్పోయిన ముసలిరాజు స్వార్థానికి బలై

పోయిన ప్రేమైకమూర్తి గాథ. యింకోదృష్టిలో ధర్మమే జీవితాశయంగా పెట్టుకున్న సారంగధరుని నైతికవిజయం. మొదటిదృష్టిలో రసం శృంగారం, రెండోదృష్టిలో కరుణ, మూడోదృష్టిలో ధర్మవీరం.

కిన్నెర : మొదటిదృష్టిలో నాటకం మొదటినుంచీ చివరిదాకా ప్రేమే అభినయించాలా ?

నేను : కాదు. స్మృతిలో వుంచుకోవాలి. ప్రేమ ప్రకటనలో, తర్వాతసారంగధరునిచంపించటానికిచేసినయత్నంలో, ఆ తర్వాత పశ్చాత్తాపంలో ప్రేమ తొంగి చూస్తుండాలి.

కిన్నెర : అయితే నటుడేం చెయ్యాలి ?

నేను : ప్రకృతిసిద్ధ ప్రక్రియా సూత్రాలను అనుసరించాలి. ఆ సూత్రాలు మూడూ యీ చెట్టులో కనిపిస్తాయి. మొదటిది : ప్రకాండం అంటే భావం, హేతుమత్వం. నాటకరంగంలో యిది డైరెక్టర్నుంచి ఉత్పన్న మవుతుంది. రెండోది : కొమ్మలు, ఆ భావంయొక్క అణువులు, హేతుమత్వ రేణువులు. యిది నటునినుంచి వుద్భవిస్తుంది. మూడోది : ఆకులు, పై రెంటి ఫలితం, భావప్రదర్శనం, హేతుమత్వ పరిసమాప్తి.

కిన్నెర : అయితే యిక రచయితకి నాటకంలోగల స్థానమేవిటి?

నేను : అతనే రసము. చెట్టులో లాగానే యీ రసము నాటకమంతా వ్యాపించి పోషించుతుంది.

కిన్నెర : యిలా చెప్పి నటుడు తన బాధ్యతలనుంచి తప్పించుకోవచ్చు,

నేను : కెమెరా మొదలైనవాటిముందు నటుడు రసావిష్కరణ చేయలేకపోతే – పదకొండుసార్లు అడ్డంకులు వచ్చాయని భయపడిపోతే… …

కిన్నెర : (కోపంతో) సరే – సరే – భయపడకుండా వుండటం యెలాగో చెప్పండి?

నేను : ప్రక్రియా నిర్మాణం అంటే యేవిటో బోధించటానికి ఒక చిన్న నాటకం వుంటే బాగుండిపోను.

కిన్నెర : యిక్కడయిందాకటినుంచీ మనం ఒకచిన్న నాటకం ఆడలా ? మనం మాట్లాడుకున్నదంతా నాటకంలో మాట్లాడినట్టుంది దీన్నే చిన్న నాటకంగా వుపయోగించండి.

నేను : అచ్ఛా! నేను డైరెక్టర్ని, నువ్వు కథానాయికవి. నీ పక్క-వేషం ఒక ముసలాడనుకో. ఆ ముసిలాడూ నేనే. డైరెక్టరిలా అంటున్నాడు. "నాటక ప్రకాండం లేక వెన్నెముక నాటక ప్రక్రియలోని సత్యాన్ని గ్రహించటం. స్టేజీమీాదా, గ్రంథాల్లో, డైరెక్టరు ముందూ కాక ప్రకృతిమధ్యలో చల్లగాలి అనుభవిస్తూ గబగబా నడుస్తూ, పరియాచకాలాడుకుంటూ తెలుసుకోవటం."

కిన్నెర : అంటే త్వరగా ఆలోచించటం, లోతుపాతులు తెలుసుకోటం, వుత్సాహం, భావవిశ్వాసం, అర్థంచేసుకోవాలనే ఆతురత, విస్పష్టస్వరం, గమనం, వాదించటానికి సంసిద్ధత!

నేను : బలేబలే! డైరెక్టరుగా నా పని నెరవేరింది. నీ సహాయంతో ప్రకాండం నెలకొల్పాను. యిక రసము : మాటలకు చేతలను అనుసంధిద్దాం. నీ పాత్ర తీసుకుంటే మనం నాటకం మొదట్లోనే యేంజేశాం ?

కిన్నెర : సినీమాలో నటించటం కష్టమని మొరపెట్టుకున్నాను.

నేను : తీవ్రంగా, గోరంతలను కొండంతలు చేసి మొరపెట్టుకున్నావు.

కిన్నెర : సినీమాని తిట్టాను. అసహ్యించుకున్నాను. తగిన ఆధారాలు చూపాను.

నేను : అయితేనేం ఆ ఆధారాలు విశ్వాసనీయంగా లేవు.

కిన్నెర : మీమాట నమ్మలేదు ...

నేను : కాని యిన్ని అంటున్నా, నువ్వు నాతో కలసి తిరిగావు కొన్ని విషయాలలో నాతో ఏకీభవించావు. విషయ పరిశీలన చేశావు. అధ్యయనం చేశావు. అలిసిపోయావు. నా వాదనను ఖండించటానికి మాటలకోసం వెతుక్కున్నావు.

కిన్నెర : యీ పనులన్నీ ఒకేసారి చేశానంటారా ?

నేను : లేదు. మనిషి అయినవాడెవడూ చెయ్యలేడు. ప్రధాన ప్రకాండం లేక ప్రధాన ప్రక్రియామాత్రం మనసులో వుంచుకుని చిన్నచిన్న ప్రక్రియలను దానికి పూసలు మాలగా గుచ్చినట్టు, ప్రతిపూసా విస్పష్టంగా గోచరించేట్లు, గుచ్చావు.

కిన్నెర: ఇదంతా స్వరభేదం, రూపభేదంమాత్రమేగా?

నేను : అది ప్రక్రియా ఫలితంగా గాక వేరువిధంగా యెలా వుత్పన్న మవుతుంది? నీ చేష్టలను వర్ణిస్తూ నువ్వు క్రియలనే వుపయోగించావు. క్రియ అనే మాటలోనే ప్రక్రియ యిమిడివుంది. మొదట నీవేదో అభిలషిస్తావు. అదే కళాకారుని సంకల్పం. తర్వాత దాన్ని క్రియా రూపంలో నిర్వచిస్తావు. అది కళాకారుని శిల్పం. తర్వాత ఆ పనిని చేసేస్తావు. అది కళాకారుని రస ఆవిష్కరణ. యిదంతా మాటలద్వారా జరుగుతూంది. ఆ మాటలు మేధావి అయిన రచయిత రాశాడనుకో. తర్వాత నువ్వు పాటలకి ప్రతిచరణంకిందా స్వరం రాసుకున్నట్టు, ప్రతిమాటకిందా లేక ప్రతి స్పీచికిందా ప్రక్రియ యేవిటో గుర్తుపెట్టుకో. స్వరం జ్ఞప్తిలో పెట్టుకున్నట్టు ప్రక్రియనుకూడా జ్ఞప్తిలో వుంచుకో. "మొరపెట్టాను", "తిట్టాను" అనే రెండు ప్రక్రియల భేదం గమనించు యీ రెండూ ఒకదాని తర్వాత ఒకటి వచ్చినా స్వర భేదం అవసరం.

ప్రక్రియ గనక బాగా గుర్తుంటె యెన్నిసార్లు అడ్డంకులు వచ్చినా, వరసక్రమం యెలా మారినా నీ అభినయానికి అడ్డంవుండదు. ప్రక్రియను ఒక్క మాటలో యిముడ్చుకుని ఆ ప్రక్రియ యేవిటో నీకు సరిగా తెలిస్తే అది నీలో నిలచిపోతుంది. దానిని ప్రదర్శించవలసి వచ్చినపుడు నీ కెందుకు అడ్డంకి కలుగుతుంది? నీ సీను లేక పార్టు జపమాలలాగా అనేక పూసలతో, అనేక చేష్టలతో గుచ్చిన మాలలాంటిది.

పూసలను నీ అధీనంలో వుంచుకుంటే, ఆ మాల తిప్పటంలో యే పూసదగ్గిరినుంచైనా ప్రారంభించవచ్చు. నీ యిష్టంవచ్చినచోట ముగించవచ్చు.

కిన్నెర: ఒక్కొక్కప్పుడు ఒక సీను సీనులో ఒకటే ప్రక్రియ వుండదనుకోండి. అప్పుడు ?

నేను : అప్పుడు ప్రేక్షకులకు విసిగెత్తకుండా అభినయించటం కష్టం.

కిన్నెర: మీరు మొదట్లో హరిప్రసాదరావు, రాఘవాచారి పేర్లు యెత్తి, వారు అభినయించిన మాటలు కొన్ని చెప్పారే, అలా చెప్పినప్పటి ప్రక్రియయేమిటి? మీరు విచారంగా వున్నట్లు కనిపించారు. కాని మన మనుకున్న 'ప్రకాండం' మరిచేపోయారు. త్వరగా ఆలోచించటం, లోతుపాతులు తెలుసుకోటం ... ప్రకాండం అని నిర్ణయించాం. మరి ?

నేను : నేను నీచేత "నిజంగా అది మన దౌర్భాగ్యమేం" అనే ముక్కలు అనిపించాలనుకున్నాను. అందుకు ఒకటే మార్గం వుంది. నీకు నా భావాలపై సానుభూతి కలిగేటట్లు చెయ్యటం. దానివల్ల నువ్వు నా మాటలను గురించి ఆలోచించావు. నే కోరిన నిర్ణయాలకు వచ్చావు.

కిన్నెర: అంటే నన్ను ఆలోచించేటట్లు చేయటానికి మీరు విషాదం నటించారన్నమాట ?

నేను : ఆ–నేను త్వరగా ఆలోచిస్తూ, లోతుపాతులు తెలుసుకుంటూ నటించాను.

కిన్నెర: ఆ మాటలతోనే యింకేదైనా ప్రక్రియను ప్రదర్శించి యిదే ఫలితాన్ని తీసుకు రాగలరా ?

నేను : అ – కాని ప్రక్రియ అవతలివ్యక్తినిబట్టి వుంటుంది. యిక్కడ నిన్నుబట్టివుంది.

కిన్నెర: నన్నుపట్టా ?

నేను : నీ స్వభావాన్నిబట్టి. నీకు నచ్చచెప్పాలంటే ఉద్వేగ మార్గంలో నీతో మెలగాలి. హేతువాదం నీజోలి కళాకారులమీద పనిచెయ్యదు. నాముందు నువ్వుగాక యే చారిత్రక పరిశోధకుడో వుంటే ప్రక్రియ మార్చి పాతకాలపు గాథలుతవ్వి తలకెత్తి అతనికి నచ్చచెప్పే వాణ్ణి.

కిన్నెర: అంటే యెదుటిపాత్ర స్వభావాన్నిబట్టి ప్రక్రియను యేర్పరచుకోవాలన్నమాట.

నేను : పాత్రస్వభావాన్నిబట్టి మాత్రమేకాదు, ఆ పాత్రను ధరించే నటుని వ్యక్తిత్వాన్నిపట్టికూడా ప్రక్రియను నిర్ధరించుకోవాలి.

కిన్నెర: అయితే ప్రక్రియ నెలా జ్ఞాపకంపెట్టుకోవాలి ?

నేను : ఉద్వేగస్మృతిద్వారా జ్ఞాపకంపెట్టుకోవాలి. భావం పట్టుపడ్డతర్వాత అదే జ్ఞప్తిలో వుంటుంది. యిక నువ్వు నటించవచ్చు. రిహార్సల్సులో ఆ ప్రక్రియను తిరిగీ తిరిగీ అభినయించు. మాటలకంటే ప్రక్రియను జ్ఞాపకం పెట్టుకోటం తేలిక. మన యీ నాటకంలో మొదట నీ ప్రక్రియ యేమిటో చెప్పు.

కిన్నెర: [మనసంతా లగ్నంచేసి] మొరపెట్టుట, తిట్టుట...
నేను : యివన్నీ నా మొహంమీద అంటున్నావుకదా ఇప్పుడు నీ ప్రక్రియ యేవిటో చెప్పు?
కిన్నెర: మీ మాటలు విశ్వసిస్తున్నానని రుజువుచేయటం.
నేను : ప్రక్రియద్వారా రుజువుచేశావు కాబట్టి నిన్ను నేనూ విశ్వసిస్తున్నాను.



# 4. పాత్ర పోషణ

[కిన్నెరా, నేనూ సాయంకాలం సినీమాకి వెళదామను కున్నాం. సినీమావేళకి హాలుదగ్గిరకు కిన్నెర రమ్మన్నది. వెళ్ళాను. నేను ఆట్టేసేపు నిరీక్షించ నక్కరలేకపోయింది. కిన్నెర తొందరగానే బయటికివచ్చింది.]

కిన్నెర: క్షమించాలి సినీమాకి నేను రావటానికి వీలులేదు. నేను ఇక్కడనేవుండి రిహార్సలు చెయ్యాలి.

నేను : అంతా వెళ్ళిపోయినట్టున్నారు. నువ్వొక్కదానివే రిహార్సలుచేస్తావా ? మళ్ళీ యేంచిక్కు వచ్చిపడ్డది ?

కిన్నెర: కావలసినంత!

నేను : అయితే నువు రిహార్సలు చేస్తుండగా వచ్చిచూడనా?

కిన్నెర: ఓ తప్పకుండా. నేనే మిమ్మల్ని రమ్మని పిలుద్దా మనుకున్నానుగాని భయం వేసింది.

నేను : భయమెందుకు ?

కిన్నెర: నావేషం యేం బావుండలేదు, అద్ధాన్నంగావుంది. యిదంతా మీమూలానే వచ్చిపడింది. మీరు చెప్పి నట్లు చేశాను. కాని నావేషం యెవరికీనచ్చలేదు.

నేను : సరే లోపలికి వెడదాంపద.

[హాల్లోకివెళ్ళాం. తోవలో నౌకరుతాత తారసిల్లాడు. రిహార్సలు జరుగుతుండగా యమభటునిలాగా ఇతడెవర్నీ లోపలికి రానీయడు. కిన్నెర నను రానియ్యమంది. తాత సరే

అన్నట్టు తలూపాడు. అతను తలూపిన వైఖరిచూస్తే అతనూ ఒకప్పుడు యాక్టరేమో అనిపించింది. హాలంతా కటికచీకటి ఒక్క పాదతల దీపంమాత్రం రంగస్థలంమీదికి వెలుతుర్ని ప్రసరిస్తోంది. నేను వెళ్ళి ఒక కుర్చీలో కూర్చున్నాను.]

కిన్నెర: ఇక్కడే మాట్లాడకుండా కూర్చోండి నాకు అడ్డం రాకండి. నేను ఒకసీను యాక్టుచేసి చూపుతాను. తర్వాత వున్నదోషా లేమిటో చెప్పండి.

[కిన్నెర స్టేజీమీదికి వెళ్ళిపోయింది. నేనొక్కణ్ణే హాలులో మిగిలిపోయాను. హాలంతా నిర్మానుష్యంగా ఉండి భావురు మంటోంది. నాచుట్టూ కుర్చీలు. బయటినుంచి కొద్దిగా శబ్దం వినవస్తోంది. హాలులోమాత్రం నిశ్శబ్దంగా ఉంది. నాముందు కూడా నిర్మానుష్యమైన స్టేజీ. నాలో ఏదో కదలికవచ్చింది. ఆస్టేజీ అంటే సానుభూతి కలుగుతోంది. విచిత్రమైన ప్రశాంతత నన్నావరించింది. నా ఉనికే మర్చిపోతున్నాను. ఇంకెవరి ఆత్మో నాలో ప్రవేశించిన ట్లనిపించింది. ఇక ఒక కల్పనా జగత్తును తిలకించాలి. స్వప్నాలతోనిండిన మనసుతో తిరిగి ఆ జగత్తునుంచి బయటపడతా కాబోలు! నిర్మానుష్యమైన హాలు. స్టేజీమీద ఒక్కపాత్రే అభినయించబోతోంది. ఇదంతా విషమాధుర్యంలాఉంది. కిన్నెర స్టేజీవింగులో గోచరించింది. మొహంలో ఆనందం కనిపిస్తోంది. రెండడుగులు ముందుకు వేసి స్టేజీమీదికి వచ్చింది. తలెత్తి ఎదురుగుండా చూసింది. నునుసిగ్గు దొంతరలు ఆమె నావహించాయి. తలవంచింది బలే! కిన్నెరా! బలే! నువుచెప్పే ప్రతిముక్కా వింటానికి

సిద్ధంగాఉన్నాను. ఇంకో రెండడుగులువేసి ఏదో అనుమానం తగిలినట్లు హఠాత్తుగా ఆగి]

అయ్యో! ఏమోకాని నా కుడికన్నదరుచున్నది! *

♦ ♦ ♦

[మళ్ళీ ధైర్యం పుంజుకున్నదానిలా నడవసాగింది. స్టేజి మధ్యకి వచ్చింది.ఎందుకో మనిషి కుంచుకుపోయింది.]

* చూడు. శాకుంతలనాటకం. వీరేశలింగంగారి అనువాదం.

హృదయమా! ఏమి యిట్లు వడకుచున్నావు? భర్తగారి భావము తెలుసుకొనన నించుక ధైర్యము వహింపుము.

[గుండెలమీద చెయ్యి వేసుకుంది. గొంతులో ప్రేమ, గౌరవం ధ్వనించాయి.]

♦ ♦ ♦

భర్త యేమి పలుకునో?

[ఆతురత, ఆందోళన ఆమె గొంతులో, మొహంలో గోచరించాయి. ప్రత్యుత్తరంకోసం ఎదురుచూస్తున్నట్టుంది.]

♦ ♦ ♦

ఈ వాగ్విజృంభణము నా కగ్నిహోత్రముగా నున్నది.

[కిన్నెర ఉలిక్కిపడింది. ఏదో ఆపద రానున్నదని పసి కట్టిన దానిలా వణికిపోయింది.]

♦ ♦ ♦

[ఇంకా ఏదో సంబోధిస్తున్న దానిలా ఉంది.]

♦ ♦ ♦

[సందేహ నివృత్తి అయినట్లుంది. నిర్ఘాంతపోయి రాతి బొమ్మలా అయిపోయింది. ఒక్కనిట్టూర్పు విడిచింది ]

హృదయమా ! నీకిప్పుడు బెడద సంభవించినది.

[కిన్నెరమీద పిడుగు పడిందా ! అవమానానికి గురియైనదానిలా]

ఈయనకు వివాహ విషయముననే సందేహము కలిగినది. ఇక దూరము పోయిన నా యాశ ఎందుకు?

♦ ♦ ♦

అటువంటి యనురాగమున కిట్టిగతి పట్టినప్పుడు నేను దలపించిన ప్రయోజనమేమి ? ఇక నన్ను గురించి నేను దుఃఖపడవలసిందే. నిశ్చయము. ప్రాణేశ్వరా ! [గొంతులో గద్గదికం వినిపించింది. తాంబూలాతీగ శాగా మీటి వదిలినట్లుంది.]

ఇప్పుడు వివాహమునందే సంశయము గలిగినది గనుక యిట్లు పిలువ తగదు. ఓ పౌరవా ! (గొంతులో పారుష్యం వినిపించింది. కోపంతో మొహం ఎర్ర బారింది) నా డా ప్రకారముగా దపోవనమునందు స్వభావముచేత జేల హృదయముగల నన్ను నీవెనో్ని శాసలుచేసి మోసపుచ్చి, యిప్పుడీ విధమయిన మాటలచేత నన్ను నిరాకరించుట నీకు తగునా ?

♦ ♦ ♦

[ఏదో హఠాత్తుగా జ్ఞాపకంవచ్చినట్టు ఏదో ఆశ అంకురించినట్టు కనిపించింది.]

మంచిది! తమరు నిజముగా బర భార్యయను శంక చేతనే యిట్లయితిరేని యీ మానవాలుచేత దమ సందేహనివారణము చేసెదను.

[విజయం తనదేననే ధీమా ఆమెలో పొడగట్టింది. వుంగరప్రవేలిని తడివిచూచుకుని ఆకస్మికంగా మనిషి కుంగిపోయింది. ఏటిలో కొట్టుకొనిపోతూ చేతికి అందిన చిన్న మొక్కను పట్టుకోగా, ప్రవాహవేగానికి మొక్క ఊడివచ్చి మొక్కతోసహా కొట్టుకుపోతున్నట్టుంది ఆమెవైఖరి. పక్కకు చూసింది.] నా వేలియుంగరములేదు.

♦ ♦ ♦

[నిట్టూర్చింది. ఇంకేమిటి గతి అనేభావం ఆమెని పీడిస్తోంది.

ఇందులో విధి యిప్పుడు తన సామర్థ్యమును జూపెను. మీకు మరియొకటి చెప్పెదను.

[పూర్వ మధురస్మృతులు ఆమె నావహించాయి. చింతాక్రాంతమైన ఆమె మొహంలో కనిపించీ కనిపించని మధురభావం మధ్యమధ్య తళుక్కుమంటూంది.]

ఒకనాడు వనమాలికామండపమందు తామరాకు దొప్పలోని నీరు తమచేతిలో బోసికొంటిరి.

♦ ♦ ♦

ఇంతలో నా పెంపుడుబిడ్డయైన దీర్ఘాపాంగమను లేడిపిల్ల సమీపమునకు వచ్చెను. మీరు కనికరము కలవారయి, 'నీవే ముందుగా నీరు త్రాగు'మని దానిని నీరుచూపి పిలిచితిరి. పరిచయము లేకపోవుటచేత నది

మీ చేతి సమీపమునకు రాదయ్యెను. పిమ్మట నేను నీరు చేతబట్టుకోగానే యది స్నేహముచేత దగ్గరకు వచ్చెను. అప్పుడు నన్ను మీ రీవిధంగా మేలమాడితిరి. "అందరును బంధువులయెడ విశ్వాసముంతురు; మీరిరు వురును నరణ్యసంభవులు"

♦ ♦ ♦

[కొరడాతో కొట్టారా? మొహంమీద ఉమిచారా? మొహం కందగడ్డ అయిపోయింది. హృదయంలో ఆరని అవమానం, విద్వేషం, అసహ్యం, ప్రేమ ఇన్ని భావాలూ ఒకేసారి ప్రజ్వరిల్లి ఆమెని కదిలించి వేశాయి. మనిషి అక స్మాత్తుగా అట్లా పెరిగిపోయిందేమిటి? ఇది ఆమె ఉద్వేగానికీ కండరాలకీ గల సహకార ఫలితం. ఉద్వేగం హెచ్చినకొలదీ స్వరం స్వేచ్ఛగా పరుగిడుతోంది. తోక తొక్కిన తాచులా]

కుత్సితుడా! నీ హృదయానుమానముచేత నితరుల నట్లే చూచుచున్నావు. పైకి ధర్మకవచమును తొడిగి గడ్డి కప్పియున్న నూతివలెనున్న నిన్నెవరు పోల గలరు?

మేలు! పురువంశజుడను నమ్మకముచేత నాలుక తేనెయు, హృదయము విషము నైన వానిచేతబడి నేనిక్కడ స్వచ్ఛంద సంచారినిగా చేయబడితిని.

[ముఖం చెరగుతో కప్పుకుని ఏడ్చింది. నాహృదయం ద్రవించిపోయింది.]

♦ ♦ ♦

[దిక్కులేదనే నిరాశ ద్యోతకం అయేటట్టు]

ఈ కుత్సితునిచేత మోసపోతిని. ఇక నాగతియెట్లు? దుఃఖములో మునిగియున్న నన్ను మీరును విడిచిపెట్టెదరా?

♦ ♦ ♦

[అవమానంతో కుమిలిపోతోంది ]

ఓ భూదేవీ! నీలోకానికి నాకు దారివ్వు.

[భూదేవి జవాబియ్యలేదు. దుష్యంతుని మాటలన్నీ మళ్ళీ జ్ఞాపకానికి వస్తున్నాయి. ఆమెలో విద్వేషం, కోపం, నిరాశ కనిపించాయి. ఆమె భర్తని ప్రేమించింది. అతనూ ప్రేమించి నమ్మించి మోసగించి పరిత్యజించాడు. ఆమె గిర్రున తిరిగి నిష్క్రమించింది ]

♦ ♦ ♦

[ఒక నిమిషం అయింది. మళ్ళీ మామూలుగా కిన్నెర నాదగ్గిరికి వచ్చింది.]

కిన్నెర: నా శక్తివంచన లేకుండా నటించాను.

[ముసిముసినవ్వులు నవ్వింది. సుశిక్షితురాలైన అభినేత్రి చిహ్నమిది. అభినయించేటప్పుడు ఎంత ఉద్వేగం ప్రదర్శించినా వేషం ఊడదీయగానే మళ్ళీ మామూలు మనిషి అవటం మహానటలక్షణం.]

నేను : వాళ్ళంతా నీవేషం యెలా వుందన్నారు?

కిన్నెర: అతిగావుందట. అంతేకాదు గుంభనలేదట. యెబ్బెట్టుగా, యెదోవెర్రిగా, తీరూతెన్నూ లేకుండా వుందట! వాళ్ళుతెలీని శివంతో యాక్టుచేశానట! ఇలాఅయితే ఆరోగ్యం చెడిపోతుందనికూడా అన్నారు

ప్రేక్షకుల వూహాకు యేమీ వదలలేదట. యిదీ వారి అభిప్రాయం. మీరేమంటారు?

నేను : నిజం!

కిన్నెర: మీరూ ఆముక్కే అన్నారు! మీరు చెప్పిందంతా ఆచరణలో పెట్టాను. యింకేంచెయ్యను?

నేను : చక్కగా నటించావు.

కిన్నెర: మీమాటలు పరస్పర విరుద్ధంగా వున్నాయి.

నేను : పరస్పర విరుద్ధంగా యేంలేవు. నే చెప్పిందంతా తూచా తప్పకుండా ఆచరణలో పెట్టావు. యింత వరకూ బాగానేవుంది. కానీ యింకో అడుగు ముందు కెయ్యాలి. సంభవలేదనీ యెబ్బెట్టుగా వుందనీ అన టంలో అతిశయోక్తి లేదు. దీనికంతకీ కారణం నాకు తెలుసు. ప్రేక్షకులకి తెలీదు. ప్రేక్షకులకి సంపూ ర్ణంగా తయారుచేసిన పాత్రను ప్రదర్శించి చూపాలి.

కిన్నెర: అంటే యింకా నేను అభ్యాసం చేయాల్సివుందన్న మాట.

నేను : ఆ – యిప్పుడు నేను చెప్పబోయేది యిదివరకే చెప్పి వుంటే దాని అంతుకనుక్కోకుండా నువ్వు వుండలేక పోయేదానివి. నీ అంతట నువ్వు కనుక్కోటానికి నీకు కొన్ని సంవత్సరాలు పట్టేది. యీలోపున యింకే దైనా సమస్య తటస్థిస్తే దానివెంట పడేదానివి.

కిన్నెర: అంతూపొంతూ లేకుండానే?

నేను : ఆ– కళాకారుడికీ, చెప్పులుకుట్టేవాడికీ యిక్కడే భేదం వుంది. చెప్పులుకుట్టటం పూర్తి అయాక దాంతో

అతని పని అయిపోతుంది. యిక ఆ చెప్పుల జతకీ అతనికీ సంబంధంలేదు. వాటి విషయమే మర్చిపోతాడు. నటునిపని ఒకనాటితో తీరిపోయేదికాదు. ఆ వేషమే మళ్ళీమళ్ళీ వేస్తుండాలి. యెప్పటికప్పుడు యింకో అడుగు ముందుకువేయాలి. యీ అడుగులన్నీ కలిసిపోతూంటాయి.

కిన్నెర: మీదంతా లెక్కల మాష్టారు ఒకటి, రెండు, మూడు, రెండురెళ్ళు నాలుగు... అన్నట్టుంది. అలా అనుకుంటే నటన కళ కిందకురాదు. చేతి పరిశ్రమ అవుతుంది. మీరుమంచిమంచి అలమార్లు అవీ నిర్మించే వడ్రంగిలా వున్నారు.

నేను : ఉద్వేగ నిర్మాతని. ఉద్వేగాలకి కావలసిన వస్తువులు, నగలు తయారుచేసి నిను అలంకరించమంటావా?

కిన్నెర: [బిగ్గరగా నవ్వి] సరే - నాకు దుస్తులు, నగలు, తయారు చెయ్యండి. బోసిగావున్న యివిగో నా చెవులు, ముక్కూ, కళ్ళు, ఉద్వేగాలూ. వీటన్నిటినీ అలంకరించండి.

నేను : నీ ఉద్వేగాల విషయం మాత్రమే జాగ్రత్త తీసుకుంటా. యిక నీ నటన అంతా చూచాను. నీ పాత్రని యెలా నిర్మించుకున్నదీ, అవయవాలమీద నీ ఆధిపత్యం, ఏకాగ్రత, ఉద్వేగాలను చక్కగా వ్యక్తీకరించే శక్తి చూచాను, చాలా బాగుంది. నినుచూచి గర్వపడుతున్నాను. కాని ఒక్కటే లోటు.

కిన్నెర: ఏమిటా లోటు?

నేను : పాత్రపోషణ ?

కిన్నెర: అదా ! అదేమంతకష్ట !? వేషం వేసుకుంటే దానంత టదే వస్తుంది.

నేను : ఆ - అలాగేం ?

కిన్నెర: నేను వేషం వేసుకోటం పూర్తి అయేసరికి నేను యేపాత్ర అభినయించాలో ఆ పాత్రే అయిపోయినట్టు నాకు అనిపిస్తుంది. అప్పుడు నేను నేనుకాను. పాత్ర పోషణకోసం తంటాలుపడక్కర్లా, దానంతటదే వస్తుంది.

నేను : అలాకాదు. నువు వేషం వేసుకోనే పూర్వమే పాత్ర పోషణలో ప్రావీణ్యాం సంపాదించాలి.

కిన్నెర: యెలాగో చెప్పండి ?

నేను : నటుడు వేషం వేసినప్పుడల్లా మానవహృదయ మంత టినీ సృష్టించుతాడు. యీ మానవహృదయం శారీర కంగా, మేధాపరంగా, ఉద్వేగపరంగా సకలలక్షణాల తోనూ ద్యోతకృకావాలి, యింతేకాదు 'అద్వి తీయం'గా వుండాలి. అది హృదయమే అయివుండాలి. అంటే కవి వూహించిన హృదయం, డైరెక్టరు నీకు విశదీకరించిన హృదయం, నీ హృదయాంతరాళం లోంచి ఆవిర్భవించిన హృదయం అదే అయివుండాలి. ఆ ఒక్క హృదయాన్నే నువు సృష్టించాలి. యింకోటి కాదు.

యిలా సృష్టించబడిన హృదయం స్టేజీమీద యే పాత్రదై వుంటుందో, ఆ పాత్ర అద్వితీయమై తక్కిన

వాటికి భిన్నంగా ఉండాలి. ఉదాహరణకు అది శకుంతల హృదయం అయివుండాలి. యింకోరిది కాకూడదు.

అందరూ మానవులే. అంతవరకే సామ్యం మనందరికీ ఒక్కొక్క తల, రెండేసి చేతులు, రెండేసి కాళ్ళు వున్నాయి. వాటి స్థానాల్లోనూ భేదంవుండదు. కాని యిద్దరు మనుషుల ఆకృతి ఒకటిగా వుండదు. పోలికలు వేరు వేరు. యిది ప్రకృతి లక్షణం. పాత్ర రూపంలో మానవ హృదయాన్ని నటుడు సృష్టించేటప్పుడు యీ ప్రకృతి లక్షణాన్ని అనుసరించి ఆపాత్రని అద్వితీయమైన దానిగా, వ్యక్తిత్వం వున్నదానిగా సృష్టించాలి.

కిన్నెర: నే నలా చెయ్యలేదా?

నేను: నువ్వు స్థూలంగా ఆ పాత్రని పోషించావు. నీ శరీరం మనసు, ఉద్వేగాలనుంచి నువు సృష్టించిన స్త్రీమూర్తి సీత కావచ్చు, దమయంతి కావచ్చు, యింకెవరైనా కావచ్చు. కాని శకుంతలమాత్రం కాదు. ఆ శరీరం ఒకయవ్వనవతిది. కాని శకుంతలదికాదు. ఆహృదయం ఒక యవ్వనవతిది. కాని శకుంతలది కాదు.

కిన్నెర: అయితే నే చేసిందంతా తప్పేనంటూరా! యింకెలా నటించాలి?

నేను: యింతకంటె కష్టమైన సమస్యల్నే దాటగల్గావు. యిదేమంత కష్టంకాదు.

కిన్నెర: సరే శకుంతల శరీరం యెలాంటిది?

నేను: నువు చెప్పు చూదాం. శకుంతల యెవరు?

కిన్నెర: మునికన్య.

నేను: అంటే?

కిన్నెర: యెక్కడో అడవులమధ్య యీ నాగరిక ప్రపంచానికి దూరంగా పుట్టింది, పెరిగింది.

నేను: ఆమె ప్రకృతిలో పుట్టింది, ప్రకృతి ఒడిలో పెరిగింది. పరిశుభ్రమైన గాలి, వెలుతురు మధ్య పెరిగింది. కల్లా కపటం యెరగని ముగ్ధ. యిక నీ చేతులు, శిరోభంగి మాలు జాగ్రత్తగా పరిశీలించుకో. గొప్పగొప్ప చిత్ర కారుల చిత్రాలు పరిశీలించు, గ్రంథాలు చదువు నీకే తెలుస్తుంది. నీ చేతులు సహజంగానే వున్నాయి. వాటిని చూస్తే పట్టణ వాసపు నాగరీక స్త్రీ చేతుల్లా వున్నాయి. యిక శకుంతల చేతులో అతి కోమలం· నీ చేతులు అలా కోమలంగా వున్నాయా? అజంతా, ఎల్లోరా చిత్రాలూ, నేటి కాలపు మహామహుల చిత్రాలు శ్రద్ధగా పరిశీలించు. యిక నీ నడక, ముగ్ధ నడిచినట్లు లేదు.

కిన్నెర: చిత్రాల్లో నడక గోచరిస్తుందా యేం?

నేను : యే దేవాలయానికో వెళ్ళి వచ్చే పోయే స్త్రీలను పరికించిచూడు. అభినయానికి లోకమే ప్రమాణం. స్టేజీమీాద ఆ నడకను నీదిగా చేసుకుని సృష్టించు.

కిన్నెర: సరే. వీటన్నిటినీ గ్రహించి నే ధరించే పాత్రలో యిమిడించటం యెలా?

నేను : అధ్యయనం చెయ్యి. వాటిని నీ స్వంతంచేసుకో. వాటి భావం అర్థంచేసుకో. రకరకాల హస్తాలను పరిశీలించు

వాటిలోని లాలిత్యం, సున్నితత్వం, మృదుత్వం గ్రహించు. నీ కండరాలను నువు శాసించగలవుగా! యేపాత్ర హస్తం యెలావుంటుందో గ్రహించి అలా వుండేట్టు నీ కండరాలను శాసించు. రెండురోజులు అభ్యాసంచేస్తేచాలు. తర్వాత పెద్ద ప్రయత్నం అక్కర్లేదు. యెప్పుడు యేరూపం తాల్చాలని నువు సంకల్పించుకుంటే ఆ క్షణంలో నీ చేతులు నువు కోరిన రీతిగా తయారవుతాయి. నీ యిష్టంవచ్చినంతసేపు అలానే వుంటాయి. అప్పుడు నీ చేతితో నీ గుండెను అదిమిపట్టు. యిప్పుడు నువు చూపిన అభినయంకటె అది విభిన్నంగా వుంటుంది అది శకుంతలహస్తం శకుంతల గుండెను అదిమిపట్టుకున్నట్టు వుంటుంది. అంతేగాని సీతహస్తం సీతగుండెను అదిమిపట్టినట్టుండదు.

కిన్నెర: యేదో ఒక చిత్రాన్ని పరిశీలించి వుపయోగించుకోవాలా రకరకాల చిత్రాలను వుపయోగించుకోవచ్చా?

నేను : రకరకాల చిత్రాలనేకాదు, నీ కనులయెదుట కనిపించే రకరకాల వ్యక్తుల అవయవాలను పరిశీలించి వుపయోగించుకో. అజంతా చిత్రాలనుంచి శిరోభంగిమం తీసుకో. అమరావతి చిత్రాలనుంచి నేత్రాలు తీసుకో. మీ చెల్లెలు చెయ్యి, మీ వదిన మణికట్టు తీసుకో. గాలికి కదలాడేమబ్బుల నడకలనుంచి నడకలునేర్చుకో.

కిన్నెర: యివన్నీ యెప్పుడు అభ్యసించాలి ?

నేను : ఆఖరిసారిగా రిహార్సలు చేయటానికి రెండు మూడు రోజులు ముందుగా పాత్రలో నువ్వు స్థిరపడిపోయి దాని నిర్మాణం బాగా అవగాహనచేసుకున్నతర్వాత. కాని కొంతమంది నటులు పాత్ర చిత్రణముందే ప్రారంభిస్తారు అలాచేయటం యింకా కొంచంకష్టం. పాత్ర మూలతత్వమును బాగా ఆకళించుకోకముందే, చిత్రణకు ప్రారంభిస్తే సూక్ష్మఫలితాలు పొందటం కష్టం. 'రెడీమేడ్' షాపులోకి వెళ్ళి చొక్కా సరిపో తుందో లేదో చూసుకోకుండానే కొనెయ్యటం లాంటిది.

కిన్నెర: వాటన్నిటినీ నా స్వభావానికి అనుకూలపర్చుకోవటం యెలా ? సమ్మిళితం చేయటం యెలా? ఒకే ఒక వాస్తవిక మానవునిగా ద్యోతకం చెయ్యటమెలా ?

నేను: మర్యాదా లక్షణాలు నువెలా నేర్చుకున్నావు? అన్నం తినటం యెలా నేర్చుకున్నావు? యింట్లో ఒకవిధంగా, పదిమంది పెద్దల ముందు యింకో విధంగా మెలగడం యెలా నేర్చుకున్నావు? నీ చుట్టూ ఉన్న వారినిచూచి వారి అలవాట్లను నీ స్వంతంచేసుకున్నావు. నేచెప్పేదీ అదే. నీ వృత్తికి కావలసింది యిలానే ప్రపంచాన్ని చూసి నేర్చుకో. అంటే నీ పాత్ర అద్వితీయమైన వ్యక్తిగా, విస్పష్టమైన వక్తిగా తయారవడానికి ప్రజల శరీరాలను, చేష్టలను అధ్యయనం చెయ్యి. అభ్యాసం చెయ్యి. ఒక్కమాటు చూస్తేచాలు వాటిని నీ స్వంతం చేసుకుని జ్ఞప్తిలో వుంచుకోగల శక్తి సంపాదించు.

యెందుకంటే నీ పాత్రను శారీరకంగా తయారు చేసుకోటానికి వ్యవధి కొన్ని రోజులుమాత్రమే వుంటుంది.

కిన్నెర: అయితే యిక పాత్ర హృదయం సంగతి?

నేను: పాత్ర హృదయ చిత్రణ భావనా సాదృశ్యానికి సంబంధించింది. అది నీ పాత్రకుకంటె ఆ పాత్రను సృష్టించిన కవికి యెక్కువ సంబంధించి వుంటుంది.

కిన్నెర: అంటే మీ వుద్దేశం శకుంతల ఆలోచించ నక్కర లేదంటారా?

నేను: ఊహుం– అంతమాట అనను... కాని కాళిదాసే ఆమె బదులు ఆలోచించాడు. శకుంతల పాత్ర అభినయించేటప్పుడు నువ్వు చిత్రించ వలసింది. కాళిదాసు చిత్తవృత్తిని– యితర కవుల విషయంకూడా యింతే.

కిన్నెర: యీ విషయం నేను అసలు ఆలోచించనేలేదు. పాత్ర యెలా ఆలోచిస్తుందని నేనూహించానో అలా ఆలోచించాలని యత్నించాను.

నేను: యెవరో ప్రతిభావంతులు తప్ప తక్కిన నటులంతా చేసే పొరపాటే అది. కవియొక్క అతి శక్తివంతమైన ఆయుధం అతని మనసు. శకుంతల చెప్పవలసినమాటలు రాస్తున్నా, మాళవిక మాటలు రాస్తున్నా కావలసిందల్లా మనసుయొక్క సమర్థత, వేగం, చురుకుతనం. నాటకంలోని యే ప్రవక్త పాత్రయినా కవి కంటె యెక్కువ మేధాసంపత్తి కలదికాదు. ఒక మాటు ఎవరో రామకృష్ణపరమహంసను 'క్రీస్తు అంటూవ్యక్తి యెవరూ లేరట. అతను కల్పితపురుషు డంటున్నారు.

మీ అభిప్రాయ మేవిటి?' అని అడిగారట. దాని మీద పరమహంస 'క్రీస్తు కల్పితపురుషుడైతే అటు వంటివ్యక్తిని ఊహించి చిత్రించినవారిమేధ,హృదయం క్రీస్తు మేధ హృదయం కంటె గొప్పది,' అని జవాబిచ్చారట. అలాగే విదూషకపాత్ర విషయంకూడాను. నువ్వు చేయవలసిందల్లా కవి హృదయం అవగాహన చేసుకోటం, దానిని అనుసరించి పాత్రను చిత్రించటం.

కిన్నెర: కవి హృదయం యెలాంటిది?

నేను : మెరుపు అంతటివేగంగలది. అమిత ఏకాగ్రతలో వుండేది. ప్రామాణికమైంది. సద్యస్ఫూర్తికలది. సూటిగా బాహాటంగా చెప్పగలదు. నేను కాళిదాసు హృదయం వర్ణించాలనిగాని విశదపర్చాలనిగాని యత్నించడంలేదు. దానినివర్ణించడానికి భాషచాలదు. నేను చెప్పదలచిందల్లా నువ్వు కాళిదాసు సృష్టించిన యేపాత్ర అభినయించదలచినా ఆ పాత్రహృదయ చిత్రణలో కవి హృదయం స్పష్టంకావాలి. నువ్వు కాళిదాసులానే ఆలోచించ నక్కరలేదు. నీ ఆలోచన యొక్క బాహ్యగుహాలు అతనివి అయివుండాలి. సర్కసులో పిల్లి మొగ్గలు వేసేవాడి వేషం వేయాల నుకో. శీర్షాసనం నువ్వు వేయగల్గాలనే నియమం అక్కర్లేదు. కాని అవయవాల కదలికవల్ల యెప్పుడు తలుచుకుంటే అప్పుడు నువ్వు శీర్షాసనం వేయగలిగినట్లు కనిపిస్తేచాలు.

కిన్నెర: దీనినంతా ఆచరణలో పాత్ర కెలా అనుసంధించాలి?

నేను : కవి వాఖ్యాలు వుచ్చరించటంలో యిదంతా యిమిడి వుంది. కవి రచనలను అధ్యయనంచేసి, బాగా అభ్యాసంచేస్తే కవి భావపరిణామం నీకు అర్థమవుతుంది. ఆ భావాల ప్రభావం నీమీద ప్రసరిస్తుంది. నీకవి రుచిస్తాయి. కవిని అర్థంచేసుకోటానికి యత్నించు. నీ స్వభావం, చేసిన అభ్యాసం తక్కినవాటి విషయంలో జాగ్రత పడతాయి.

కిన్నెర: పాత్ర ఉద్వేగాలను చిత్రించటంలో కూడా యీ నియమమే వర్తిస్తుందా ?

నేను : నటుల అభిలాష, తాహతు, వ్యాఖ్యానపద్ధతి కవి లక్ష్యంలో వుంచుకోవాల్సింది. ఉద్వేగ రంగంలోనే. లేకపోతే నటులు తామూహించిన పాత్ర ఉద్వేగాలను ప్రదర్శించటంలో ఉత్తమ ఫలితాలు పొందేందుకు కవి రచనను సడలించటం అవసర మవుతుంది.

కిన్నెర: ఆమక్క అనకండి. కవులు మిమ్మల్ని నిలువునా ఖూనీ చేస్తారు.

నేను : తెలివిగల వాళ్ళయితే అటువంటి పనేం చెయ్యరు. పాత్రకు ప్రాణం ఉద్వేగం. ఉద్వేగం ద్వారానే పాత్రకు జీవం పొయ్యాలి. నాటక ప్రయోజనాన్నీ భావాన్నీ నాశనం చెయ్యకుండా తెలివిగల కవులు ఉద్వేగసృష్టిని సామరస్యంతో గావించుతారు. నటుల సామర్థ్యాన్నిబట్టి రచనలు మార్చుకున్న నాటకకవులు చాలామంది వున్నారు. నీ, నాలాంటివాళ్ళం చాలా

మంది నాటకరరంగంలో కవులపత్రాన కృషిచేస్తున్నా మని వారికి తెలుసు

కిన్నెర: శరీరాన్ని హృదయాన్ని చిత్రించినట్లే ఉద్వేగాలను కూడా విస్పష్టంగా చిత్రించాలి కదా? దానికి సరైన మార్గమేమిటి?

నేను : పాత్రలోని సామాన్య మానవ ఉద్వేగాలను నువ్వు గుప్పిటిలో పెట్టుకున్నప్పుడు, యెప్పుడు యెందుకు కోపం వస్తుందో; యెప్పుడు దుఃఖం, నిరాశా వస్తాయో నీకు స్పష్టంగా తెలిసినప్పుడు ఉద్వేగాలను ద్యోతకం చెయ్యి డానికి సంపూర్ణ స్వేచ్ఛకోసం అన్వేషించు. ఆస్వేచ్ఛే ఉద్వేగ చిత్రణ. పాత్రయొక్క ఆంతరంగిక నిర్మాణం బాహ్యస్వరూపం నీ అధీనమైనతర్వాత పాత్రభావాలు కవిభావాలతో సమన్వయం పొందాయో లేదో చూచుకో. ఆ తర్వాత రిహార్సల్సులో ఉద్వేగ ప్రదర్శ నలో యెక్కడ నీకు కష్టం అనిపిస్తుందో గుర్తుపెట్టుకో. కారణాలకోసం అన్వేషించు, కారణాలు చాలా వుండచ్చు. ప్రక్రియ నీకు అర్థం కాకపోవచ్చును. కవి రాసిన మాటలు ఉద్వేగ ప్రదర్శనానికి ఆటంకం కావచ్చును. కారణం యేమిటో కనుక్కొని దానిని తొలగించుకో. ఉదాహరణకి శకుంతల వేషం వేయటం యే అంకంలో నీకు కష్టమనిపించింది?

కిన్నెర: పంచమాంకం. యిప్పుడు నేను రిహార్సలుచేసిందే.

నేను : సరే ఆ అంకంలో నువ్వు అనుభవించాల్సిందేమిటి?

కిన్నెర: అవమానింపబడాననే రోషం.

నేను: అది ప్రధానంకాదు. భర్త పరిత్యజించాడనే నిర్వేదం. విను శకుంతల మునికన్య. ముగ్ధ, సాధ్వి, దుష్యంతుని మనసారా ప్రేమించింది. పైగా కణ్వుడంతటి మహర్షి చెప్పుచేతలలో పెరిగి ఆయన ప్రీతికి పాత్రమైంది. అతి ప్రశాంత వాతావరణంలో పెరిగింది. అటువంటి శకుంతల భర్తముందు నిలబడింది. దుష్యంతుడు ఆమెని పరిత్యజించాడు. ఆముగ్ధకి తలపై పిడుగుపడినట్లయింది. స్త్రీ జాతినే అవమానించిన భర్తపై ఆమెకి కోపం వచ్చింది. అందుకే, "పౌరవా!" "కుత్సితుడా!" అంటూ సంబోధించింది. ఆమె అభిమానాని కది తార్కాణం అన్నమాట నిజమే. కాని రోషంతో, "కుత్సితుడా! పైకి ధర్మకవచమును తొడిగి గడ్డి కప్పియున్న నూతి వలె నున్న నిన్నెవరు పోలగలరు!" అన్నప్పుడు నీవు ఉద్వేగం ఎలా చూపాలి. కాళిదాసు ఆఉద్వేగాన్ని వర్ణించిన తీరుచూశావా?

"దరుణియపార కోపమునదద్దయు నేత్రము లెర్రజేసి వం
కరలగుకన్బొమల్ విరుచుగాస్మరచాపవిఖండనక్రియన్"

'స్మరచాప విఖండన' లాగా నీ కన్బొమలు వునాయా చెప్పు? నీ చేష్టలు మొగుడు తిట్టి అవమానించగా గయ్యాళిభార్య తిరిగి భర్తని తిట్టినట్టుందిగాని శకుంతల రోషంతో పలికినట్టులేదు. శకుంతల స్వభావం ఆలోచించావా? ఆమె ముగ్ధ. సాధ్వి. నాగరిక ప్రపంచంలో అడుగుపెట్టింది కాదు. పైగా చుట్టూ పది మంది అపరిచితులు, రాజమర్యాద లెరిగినవారున్నారు.

ఆలాంటప్పుడు తన రోషాన్ని కోపాన్ని ముఖకవళికలో మాత్రమే ద్యోతక చెయ్యాలి. ఉద్వేగం నీ అదుపు తప్పింది. హంగామా చేశావు. దాంతో యీఅంకంలో నువ్వు చిత్రించిన చిత్రణకి తక్కిన, అంకాలలోని శకుంతలాపాత్ర చిత్రణకి సమన్వయం కుదరలేదు అందుకే నీ అభినయం అతిగా, సంభనలేకుండా, యెబ్బెట్టుగా, వెల్తిగా వుంది.

ఇంకో విషయం. దుష్యంతుడు శకుంతలను ప్రేమించి, నమ్మించి మోసగించాడు. యిక ప్రపంచమే ఆమెకి శూన్యం. జీవితంమీద ఆమెకి ఆశ నశించింది. యిక ఆమెకి మిగిలింది శూన్య ప్రపంచమే. అందుకే శకుంతల "ఓ భూదేవీ! నీలోకి నాకు దారియిమ్ము!" అని భూదేవిని ప్రార్థించుతూ నిష్క్రమించింది. యిక్కడ వ్యక్తీకరించవలసింది నిర్వేదం, నిస్పృహ. పుట్టెడు "దుఃఖములో మునిగియున్న" శకుంతలను భర్త అవమానించాడని అలిగి పుట్టింటికి పరుగెత్తే సామాన్య స్త్రీగా నువ్వు చిత్రించావు. దీనికంతకీ కారణం పాత్రస్వభావమునకు అవస్థకుగల అన్యోన్య సంబంధం అవగాహన చేసుకోకపోవటమే. నువ్వు యే డైలాగుదగ్గిర ఆ డైలాగులో భావం యెంత ఉద్వేగంతో ప్రదర్శించాలి అనేదే యెంచుకున్నావుగాని, ఆపాత్ర స్వభావంలోని విశిష్టతను, స్వభావానికి అవస్థకి సమన్వయమును పరికించలేదు. అందుచేతనే నీ శకుంతలపాత్ర యెబ్బెట్టుగావుంది. ఈ అంకంలో నీపాత్ర

కంతటికీ దిక్కూచి "భూదేవీ! నాకు నీలోకి దారి నిమ్మ" అనేదే ఈ అవస్థా నివృత్తికే నువ్వు మొదటి నుంచీ పాత్రని సిద్ధించుకుంటూ రావాలి. యిప్పుడు శకుంతల పాత్రను యీ అంకంలో అభినయించటం యెలాగో అర్థమైందా?

కిన్నెర: ఆ – యీసారి అభినయిస్తా చూడండి.

[కిన్నెర లేచింది. ఇంతలో అకస్మాత్తుగా వెనకనించి]

"అరయఁగ మానవేతరములై తగు జంతువులందు స్త్రీలలో
గరము నిసర్గ పాటవము గన్పడ, జెప్పగరాని ప్రాజ్ఞలౌ
తరుణుల మాట తా బరభృత ప్రకరం బితర ద్విజాళి
నంబరమున కేగుదాక బెనుపంగి నొనర్చెదె కన్నబిడ్డలన్.

కిన్నెర: [రోషంతో చప్రున వెనుదిరిగి "కుత్సితుడా..."]

[కిన్నెర ముఖం ఎర్రబారింది. కనుబొమలు మరుని విల్లు త్రుంచినట్లున్నాయి. ఆ రోషంలో నిర్వేదం, నిరాశా ద్యోతక మవుతున్నాయి. వెనక్కి తిరిగి చూచాను. ఎదురుగా నాకరుతాత కన్పించాడు. మొహందీర్ఘాలోచనలోవున్నట్టుంది]

కిన్నెర: యిష్ యింతేనా! యిపుడీ వేషం నాకెంతో తేలిక అనిపిస్తోంది.

తాత: అంతేనమ్మా. అంతే. అసలు రహస్యం బోధపడితే వేషం వేయటం నల్లేరుమీాద బండిలా వుంటుంది.

కిన్నెర: తాతా! నీకు మాపార్టులన్నీ యెలాకంఠతావచ్చాయి?

తాత: నలభై సంవత్సరాలుమన దేశంలోనినటులందరితో కలిసి వేషాలువేశాను. హరిప్రసాదరావుపక్క వేషంకట్టాను.

యడవల్లి పక్క వేషం వేశాను. రాఘవాచారితో వేషం వేశాను. మంచిమంచి నాటకాలన్నిటిలో నౌకరు వేషం దగ్గిరనుంచి రాజు వేషందాకా వేశాను. ఆ పాత్రలన్నిటినీ శ్రద్ధగా పరిశీలించాను. కృషి చేశాను. కాని వాటిని నిర్దుష్టంగా తయారు చేయటానికిగాని, యీాయనగారు యిప్పుడు నీకు చెప్పిన విషయాలను గురించి ఆలోచించటానికి గాని నాకు వ్యవధి లేకపోయింది. యిప్పుడు వెనక్కి వెళ్ళి నేను యే వేషం యెలా నటించిందీ జ్ఞప్తికి తెచ్చుకుంటూంటె నే చేసిన తప్పులు, పొరపాట్లు, వాటికి కారణాలు గ్రహింపుకు వస్తున్నాయి. కాని ముసలివాణ్ణి అయిపోయాను. వేషాలు వేసి నా ఆలోచన లన్నిటినీ పరీక్షించుకోటానికి కాలం మించి పోయింది. యిక్కడ మీాబోటి వాళ్ళంతా రిహార్సల్సు చేస్తుంటే మళ్ళీ నేను యువకుణ్ణయితే నటించి చూప్రదునుగదా అనిపిస్తూంటుంది. కాని యేం లాభం? (నా కేసి తిరిగి) మీారు చెప్పిందంతా విన్నాను. అదంతా అక్షరాలా నిజం! నిజం!

[నేను ఆశ్చర్యపోయి చేయెత్తి నమస్కరించాను]

తాత: క్షమించండి. రిహార్సల్సు వేళయింది. యిక యాక్టర్లంతా వచ్చేస్తారు. తమరు యిక వెళ్ళితే బాగుంటుంది...

[తాతలాంటి వాళ్ళు యింకెందరు అజ్ఞాతంగా మన తెలుగు గడ్డపై ఉన్నారో అని ఆలోచిస్తూ ఇంటి మొహం పట్టాను]

# 5. పరిశీలన

[కిన్నెర మేనత్త అభ్యుదయ భావాలు కలది. చాలా నాటకాలు చూసింది. నాటకమంటే మహాభిమానం. సంస్కరణాభిలాషి. ఒకనాడు సాయంత్రం టీకి వాళ్ళయింటికి రమ్మని నను ఆహ్వానించింది. ఆవిడ సంగతి కిన్నెర నాతో చెప్పిం దగ్గరనించీ ఆవిడను చూడాలని నాకు ఉబలాటంగానే ఉంది. సరేనని వెళ్ళాను. టీ చక్కగా ఉంది. కిన్నెర రిహార్సలుకు వెళ్ళిందట. ఇంకా రాలేదు.]

మేనత్త : మా అమ్మాయి విషయంలో మీరింత శ్రద్ధ తీసుకుంటున్నందుకు కృతజ్ఞతాభివందనాలు. మీ దయ వల్ల మా అమ్మాయి మంచి పేరులోకి వచ్చి నాలుగు డబ్బులు సంపాదించుకుంటోంది.

నేను : నాటకరంగంమీద యిప్పుడు స్త్రీలకి మంచి డిమాండు వుంది. మీ అమ్మాయి తెలివిగలది. కష్టపడి కృషి చేసింది. యేదో నాకు తోచిన సలహాలు చెప్పాను అంతే.

మేనత్త : యింకా మీదగ్గర నేర్చుకోవలసిందేం వుందో నాకు బోధపట్టంలేదు. యిప్పటికే మా అమ్మాయి పేరు పేపర్లలో పడుతోంది. పెద్ద స్టారని పేరు వచ్చేసింది. నాకూ, మా అమ్మాయికీ నాటక రంగమంటే ప్రాణం, లేచొస్తుంది. బళ్ళారి రాఘవాచారి వేషా

లన్నీ చూశాను. ఓ! యేం యాక్టరు! యేం యాక్టరు! మహా ప్రతిభావంతుడు. రాఘవాచారి నాటకాలేకాదు. కొత్త నాటకం యేది ప్రదర్శించినా తప్పకుండా వెళ్ళి చూసి వస్తుంటాను.

నేను : బలే!

మేనత్త: నాటక కళాభివృద్ధికి నేను చేయగల్గిన సేవ చేస్తున్నాను. అటు సంస్కృత నాటకాలు... యిటు బళ్ళారి నాటకాలు, పానుగంటివారి నాటకాలు, వేదం వారివి. మరిచేపోయాను, ఆ అప్పారావుగారి కన్యాశుల్కం! ఒహో! యేం గొప్ప నాటక మనుకున్నావయ్యా! "డామిట్ కథ అడ్డంతిరిగింది!" (నవ్వి) యిక యీరోజుల్లో యెమెచూరు యాక్టర్లు బయలుదేరారు. వీళ్ళంతా చిత్తశుద్ధితో నాటకకళను వుపాసించ తలచినవారే. కాని పాపం! సంవత్సరానికి ఒకటో రెండో నాటకాలకంటె ఎక్కువగా ఆట్టానికి వీలుపట్టంలేదు. వీళ్ళే గనక నటనని నిత్యకృత్యంగా పెట్టుకుని రోజూ వేషాలు వేస్తుంటే గొప్ప వాళ్ళయిపోయేవాళ్ళు.

[నేను కప్పుడు టీ తాగేశాను. ఇంకో కప్పుడు ఇమ్మందామని అడుగుదా మనుకుంటుంటే కిన్నెర చక్కా వచ్చింది. గది మధ్యలో ఆగి మా ఇద్దరికేసీ చూసింది]

కిన్నెర: మీ యిద్దరూ యేమిటీ మాట్లాడుకుంటున్నారు?

మేనత్త: ఆ-యెదో నాటక రంగం, కవులు, నటుల్ని గురించి మాట్లాడుకుంటున్నాం.

కిన్నెర: (కొంచెం వేళాకోళంగా) పోట్లాడుకోవటంలేదుగదా?

నేను: అభిప్రాయభేదాలువచ్చాయి. మీ అత్తయ్య చెప్పింది నేను ఖండించబోతుండగా నువ్వు వచ్చావు. మీ అత్తయ్య అంటోంది, 'నటనని నిత్యకృత్యంగా చేసుకుని ఆదేపనిగా వేషాలు వేస్తుంటే చాలు నటులు గొప్పవాళ్ళయిపోతారు' అని.

మేనత్త: నే జెప్పింది సరైందే అనుకుంటా. మీసిద్ధాంతాల్లో, మన తత్వశాస్త్రంలో, మీసమస్యల్లో నాకు విశ్వాసం లేదు. క్షమించండి. నేను ముక్కుసూటిగా పోయేదాన్ని. మనసులో వున్నది వున్నట్లు చెప్పేదాన్ని. యిక నా సిద్ధాంతం యేవిటంటారా? నటుడు కావాలనుకుంటే నటించు, నటించు. నీకు గిట్టుబాటు అయినంతవరకు యే వేషంపడితే ఆ వేషం వెయ్యి. నీకు గిట్టుబాటుకాదూ. ఊ వేషాలు వేయటం మానేసెయ్యి. మా అమ్మాయికిమల్లే ప్రతిభవుంటే...

కిన్నెర: అత్తయ్యా! యేవిటి...

మేనత్త : పిచ్చిపిల్లా! అన్నివస్తువులకిలా ప్రతిభక్తి కూడా ప్రచారం చేస్తేనేకాని గిట్టుబాటుకాదు. ప్రతిభ ఎంత యెక్కువవుంటే అంత ఎక్కువకాలం స్టేజి యేలవచ్చు.

నేను : ప్రతిభకి అంత వున్నతస్థానం మీరు యివ్వటం సంతోషమే. కాని ప్రతిభకికూడా కృషి అవసరమనీ, కృషి ద్వారానే ప్రతిభని కనిపెట్టవచ్చనీ మీకు తోయటంలేదూ?

కిన్నెర : అత్తయ్యా! అడవుల్లో పండే పండుకు, మనదొడ్లోనే మన తోటలోనే మన పోషణకింద కాచే పండుకు

వున్న తేడాయే, వట్టి ప్రతిభకీ, కృషితో కూడిన ప్రతిభకీ వుంది. మనదొడ్లో కాచినపండ్లు అడవి వాటికంటె రుచిగా వుంటాయి.

మేనత్త : యీ కవిత్వభాషలో మాట్లాడటం బాగా లేదు. పళ్ళవిషయం వేరు...

నేను : (త్వరగా) ప్రతిభవిషయం వేరు.అంతేగా. బాగాలేదు? సరే పోలికలు తేవద్దు. కులాసాగా కాసేపు కాలక్షేపం చేద్దాం. యింకో కప్పు టీ యిస్తారా? [టీ కప్పు అందుకుని] జర్మన్ కిండర్ గార్డెన్ బడుల్లో ఒక తమాషా ఆట ఆడతారు. యెప్పుడైనా దానిసంగతి విన్నారా ?

మేనత్త : లేదు.

నేను : ఆ ఆటలో మాష్టరు, పిల్లలు ఆ రోజున ఆ కిందటి రోజున, కొన్నిరోజుల కితం చేసినపనులు వాళ్ళచేత చెప్పిస్తాడు. దీనివల్ల పిల్లల జ్ఞాపకశక్తి వృద్ధి అవుతుంది. వాళ్ళ పరిశీలనా జ్ఞానం సున్నితమవుతుంది. ఒకొక్కప్పుడు వాళ్ళయిష్టంవచ్చిన విషయాలు చెప్తారు. వాటినిబట్టి మాస్టరు పిల్లల ఆసక్తి యెటువైపు నడుస్తూందో గ్రహించి వారికి ప్రోత్సాహ మివ్వడమో, లేకపోతే, తక్కిన మాష్టర్లని, పిల్లల తలిదండ్రులని హెచ్చరించటమో చేస్తాడు. ఉదాహరణకు ఒక పిల్లవాడు తాను యే కాకిగూడునో యెలా పడగొట్టిందో జ్ఞాపకం పెట్టుకుని వుంటె అతన్ని శిక్షించకుండా అతని ఆసక్తి యింకో విషయంమీదికి మరలించటానికి యత్నం చేస్తాడు.

మేనత్త : బలే! బలే బావుంది

నేను : యిదేవుంది! యిదే విధంగా పెద్దవాళ్ళనికూడా వారు వారుచేసిన పనులను చెప్పమంటే యింకా రంజుగా వుంటుంది. మనకి సహజంగా వుండే యీ పరిశీలనా శక్తిని యెంతతక్కువగా మనం, పెద్దవాళ్ళం, ఉపయోగిస్తామో తెలుసుకుంటే యింకా తమాషాగా వుంటుంది. గత యిరవైనాలుగు గంటలలో తాము చేసిన పనిని బహు కొద్దిమందే జ్ఞప్తిలో వుంచుకోగలరంటే నమ్మండి

మేనత్త : అదేవిటి! అదంతా అబద్ధం. జరిగిపోయిన యిరవైనాలుగు గంటలలో నేను యేంచేసిందీ తూచా తప్పకుండా చెప్పమంటే చెప్పగలను.

నేను : అవును. మీరు చెప్పగలరు! చెప్పటంకాదు. మాట్లాడకుండా ఆచరణలో చూపాలి. తిరిగి ఆ పనులను చేసి చూపాలి

మేనత్త : ఓ – నే తలుచుకుంటే అలాగే చేయగలను. నేను ముక్కుకు సూటిగా పోయేదాన్ని. మనసులో వున్నది వున్నట్లు చెప్పేదాన్ని.

నేను : సరే. ఆలా నేకానీండి. యిదేవుంది చిన్నపిల్లల ఆట! నే చెప్పింది చేసిచూపుతారా?

మేనత్త : ఓ– నీయిష్టంవచ్చింది యేదైనాసరే చేసిచూపుతా.

నేను : బలే! చిన్నవిషయంతో ప్రారంభిద్దాం...నిమిషంకితం మీరు మీచేతుల్తో నాకు కప్పుటీ యివ్వటం తిరిగి నటించి చూపుతారా?

మేనత్త: బలే తమాషాగావుండే. (నవ్వుతోంది) నన్ను మళ్ళీ
ఆ కిండర్ గార్డెన్ బళ్ళోకి వెళ్ళమంటారా?
నేను: అబ్బే! అదేమిటండీ, యిది తమాషాకి ఆడే ఆట. యీ
తడవ వంతు నాది. తర్వాత మీ అమ్మాయిది.
కిన్నెర: అత్తయ్యా! కానీ, నాకూ చూడాలని సర్దాగావుంది.
మేనత్త: సరే అలాగేలే. చూడండి యిదిగో కప్పు...
నేను: (అడ్డం వెళ్ళి) మాటలు కాదు కావల్సింది చేతలు.
మేనత్త: అవునవును. మర్చిపోయా మౌనం మహాగొప్పది!
[ఆమె నటించాలని దృఢనిశ్చయం చేసుకుంది. మొహం ముడతలు పడింది. ఆలోచన ప్రారంభమైంది. కుడిచేత్తో కప్పు తీసుకుని టీపాయి కేసి ఎడమచెయ్యిచాచి తను చేస్తున్న తప్పును గ్రహించింది. కప్పు బల్లమీద పెట్టి కుడిచేత్తో టీపాయి తీసుకొని పైకెత్తింది]
నేను: [టీ తాగుతూ, ఏ పేవీ ముట్టుకోకుండా చేష్టలతోనే
భావం వ్యక్తీకరించండి.
మేనత్త: అదే నే చేస్తున్నది.
నేను : అయితే ముందు టీ పాయి బల్లమీద పెట్టండి.
మేనత్త : సరే.
[టీ పాయి బల్లమీద పెట్టింది. చేతులు రెండూ బల్లమీద ఆనించి తటాలున చేతులు ఎత్తి పిచ్చివేగంతో కప్పు తీసుకుని దానిలో టీ పోయటమనే ప్రక్రియ చూపించింది. తర్వాత టీ పాయి బల్లమీద పెట్టకుండానే పాలు కలిపినట్లు, కప్పు నాకందించినట్లు నటించింది. కాని పంచదార వేయటమనే ప్రక్రియమర్చిపోయింది.

సాసరు యివ్వడం కూడా మర్చిపోయింది. కిన్నెర పక
పకా నవ్వింది నేను టీ తాగటం పూర్తి అయింది.]

మేనత్త : యేదో తమాషా, అంతే.

నేను : తమాషా యేంకాదు. సానబట్టని పరిశీలనాశక్తి, పట్టి ముడిసరుకు! మీరు నాకు టీ యివ్వడమనే యీ ప్రక్రియను మీ అమ్మాయి నటించి చూపుతుంది. నేనిలా చేయమంటానని ఆమెకు తెలీదు కాబట్టి ముందుగా తయారుకాకుండా నే చేసి చూపాల్సివస్తుంది.

కిన్నెర : చెప్పనా? నేను వచ్చేటప్పటికి మీరూ, మా అత్తయ్యా ఆప్యాయంగా మాట్లాడుకుంటున్నారు. నేను వూరుకోలేక పోయాను.

నేను : సరే, ఆ ప్రక్రియను మాటల్లోనే చెప్పు. అది యితరుల ప్రక్రియ. నువ్వే టీ కప్పు నాకు అందించివుంటే నిన్నే తిరిగీ ఆ ప్రక్రియను చేష్టలద్వారా చూపమందును. నీ చూపులోనూ, స్మృతిలోనే కాకుండా నీ ప్రతి అవయవంలోనూ పరిశీలనాశక్తిని పెంపొందించుకోవాలి.

కిన్నెర : మీరు నిన్ను టీ అడిగేసరికి వారికేసిచూసి చిరునవ్వు నవ్వావు. తర్వాత టీ యింకా వుందా అయిపోయిందా తెలుసుకుందామన్నట్లుగా టీ పాయి వంకచూశావు. ఆ తర్వాత నాకేసిచూసి యీయన తెలివిగలవాడు కాదా? అన్నట్లుగా మళ్ళీ చిరునవ్వునవ్వావు.

మేనత్త : ఊహుం – నేనేం నవ్వలేదు.

నేను : మీరు నవ్వారు. నాకు బాగా జ్ఞాపకం. నాకు ప్రోత్సాహమిచ్చింది మీ చిరునవ్వు ఒక్కటే.

కిన్నెర : ఆ మీాదట కప్పు అందిస్తాడని ఆశిస్తున్నట్లు వీరివంక చూశావు.

మేనత్త : అట్లానా ?

కిన్నెర : తర్వాత యింకో కప్పు ట్రేలోనించి కుడిచేత్తో తీసుకుని దాన్ని సాసరుమీాదపెట్టి నీముందుంచుకున్నావు. టీపాయి యెత్తావు. అది బాగా బరువుగా వుండటంవల్ల కిందపెట్టి, కర్ణీగట్టిగా పట్టుకని పైకెత్తావు. యెడమ చేతి వేళ్ళతో టీపాయ్ మూాత అదిమిపట్టి టీకప్పులో పోయటం ప్రారంభించావు. మూాత వేడిగా వున్నందువల్ల వేళ్ళుమార్చుకోటం మొదలుపెట్టావు. కప్పు మూడుపాళ్ళు నిండినతర్వాత టీపాయి నీ దగ్గిరిగా పెట్టుకుని మళ్ళీ చిరునవ్వు నవ్వావు. తర్వాత ఎడమ చేత్తో పాలు పోశావు. తర్వాత చెంచాతీసుకుని రెండు చెంచాల పంచదార టీలో కలిపావు. టీకప్పు వీరికి అందించి చెంచా అదుగో అక్కడవుంచావు.

మేనత్త : [అవమానం పొందినదానిలా] నువ్వు స్టేజీమీాద యాక్టుచేస్తున్నట్టుంది. నన్ను ఓకంట కనిపెడుతూనే వున్నా వున్నమాాట !

నేను : కోప్పడకండి. [కిన్నెరకేసితిరిగి] పంచదార మీా అత్తయ్యకి వెంటనే కనపడలేదు. దానికోసం ఓ అర నిమిషం కంటితో బల్లంతా వెతికింది యీా విషయం చెప్పటం మరిచిపోయావు.

కిన్నెర : అవును. మర్చేపోయాను. యింతేకాదు మీరు అప్పుడు జేబురుమాలా చేత్తో పట్టుకుని ఆడిస్తున్నారు.

మేనత్త : [నవ్వుతూ] నువ్వూ పప్పులో కాలేశావన్నమాట!

నేను : తప్పులు పట్టుకోవాలని నాకేం లేదు. పరిశీలనాశక్తి యెలా వుపయోగిస్తున్నదో అని శ్రద్ధగా పరికించి చూచాను. అంతే.

మేనత్త : దీనిచేష్టలన్నీ పరికించిచూట్టానికి యీ పిచ్చి ఆట నేర్పావన్నమాట.

నేను: నేనేం నేర్పలేదు. మే మిద్దరం నాటక రంగంలో కలిసి కృషిచేస్తున్నాం. అక్కడ నేర్పడం, నేర్చుకోటం అంటూ ప్రత్యేకంగా యేమీ వుండదు, అభ్యాసం! అభ్యాసం ఒక్కటే అక్కడ అవసరం.

మేనత్త: అదే నే చెప్పేదీని. నటించు! నటించు! నటుడవై పోతావు. అంతేకదూ?

నేను: ఊహుఁ— దీని ప్రక్రియా పర్యవసానమే నటన. యీ పర్యవసానానికి వెనక వున్నదీ, యీ పర్యవసానానికి దారి తీసేదీ అభ్యసించు. నటించిన తర్వాత యిక చేసే దేమీ లేదు.

మేనత్త: (కొంచం వేళాకోళంగా) నటనకీ పరిశీలనా శక్తికీ సంబంధ మేమిటి?

నేను: అబ్బో! చాలా వుంది. దైనందిన జీవితంలో అపూర్వమైన వాటి నన్నిటిని నాటక కళోపాసకుడు గుర్తించ

టానికి యీ పరిశీలనాశక్తి తోడ్పడుతుంది. దృగ్గోచర మయేమానవ చేష్టలతో మేథను నింపుతుంది. అతీంద్రియ భౌతికస్మృతిని వృద్ధిచేస్తుంది. పాత్రధారణలో నటించ వలసిన యే చేష్టకైనా అనుగుణతను ప్రసాదిస్తుంది. ప్రజలలోని, కళాఖండాలలోని, వివిధ వ్యక్తులను, విలువలను మెచ్చుకునేటట్లు చేస్తుంది. బాహ్య ప్రపంచంలోని ప్రతిదీ జీర్ణించుకోవటం ద్వారా నటుని అంతరంగిక జీవనమును సంపూర్ణంగా పెంపొందిస్తుంది.

హిందూ యోగి నాలుగు అరిటిపళ్ళతో ఒక రోజల్లా కాలక్షేపం చేసేస్తాడు. ఆ నాలుగు పళ్ళలోని ఆ కాసిని విటమినుల ద్వారా శక్తిని సంపాదించుకుంటున్నాడు. మనమో పొద్దున్నే పొట్ట నిండా టిఫిన్ వేసినా మళ్ళీ పదింటికే తిండికితయారవుతాం. అలాగే మన జీవితంలో కూడా. ప్రతిదీ పరికించామని అనుకుంటాం. కాని దేన్నీ జీర్ణం చేసుకోలేక బోతున్నాం. నాటకరంగంలో మానవజీవితమును తిరిగీ సృష్టించాల్సి వుంటుంది. పరికించింది జీర్ణించుకోకపోతే ఒక్క అడుగు ముందుకు సాగదు. అక్కడ మన ముపయోగించే పరికరాలను జాగ్రతగా పరిశీలించాల్సి వుంటుంది.

మేనత్త: అందుకని నేను టీ కప్పులో యెలా పోస్తానో పరిశీలించమని మా అమ్మాయికి చెప్పాలన్నమాట. మీ ఇద్దరూ కలిసి నను నవ్వులపాలు చద్దామనా మీ యెత్తు?

కిన్నెర: అబ్బే! అదేంకాదు అత్తయ్యా! యేదో తమాషా చేస్తున్నారు అంతే.

మేనత్త: ఆ మాత్రం గ్రహించలే ననుకున్నావా? ఆయన తమాషా యేం చెయ్యటంలేదు. అయినా సీరియస్‌గానే వున్నారు, నేనూ సీరియస్‌గానే వున్నాను.

నేను: మీరేం సీరియస్‌గా లేరు. యీ ఆట కొనసాగించ మనే అంగీకారం మీ కనులలో ద్యోతకమైంది. మీకు సర్దాగానే వుంది. మంచిదే. నేనేమీ నేర్పలేను గాని మీకు సంతోషం కలిగించాలని యత్నిస్తాను. మీ పరిశీలనా శక్తి తక్కిన విషయాలు చూసుకుంటుంది.

మేనత్త: యింకో కప్పు టీ కావాలంటే మీరే పోసుకుని కలుపుకోండి.

నేను: (నేను టీ కలుపుకుంటున్నాను. మేనత్త తదేకదీక్షతో నా కేసి చూసింది) మీకు నాటక రంగం అంటే యెంతో అభిమానం. మీ మేనగోడలూ నేనూ నాటక రంగంలో కృషి చేస్తున్నాం. కొత్త నాటకం చూడ టానికి వెళ్ళేటప్పుడు మీరు మంచి చీరా అదీ కట్టుకుని ముస్తాబై వెళతారు. మేమో, వేషం వేసినప్పుడల్లా 'ముస్తాబై' వెళ్ళాలి. ప్రతి తడవకు మేము ఉత్తమంగా తయారుకావాలి. పరిశీలనాశక్తి చురుకుగా లేని నటుడి నటన పూరంతా పండగ చేసుకుంటుంటే మనం చినిగి పోయిన బట్టలు కట్టుకున్నట్లుంటుంది. సాధన పర్యవసానమే ఆవేశం. జీవితంలోని ప్రతి రోజూ యెడతెగ

కుండా తీక్షణంగా పరిశీలించటంవల్లనే నటుడికి ఆవేశం కలుగుతుంది.

మేనత్త: అంటే గొప్ప గొప్ప నటులంతా వారి పరిచయస్తుల మీాదా, బంధువులమీాదా, దారిపోయే వారిమీాద నిఘాపెట్టి చూస్తారన్నమాట. అంతేనా?

నేను: ఆ- యితర్లనొక్కరినే కాదు. మహా నటులు తమను తామే పరిశీలించుకుంటారు.

కిన్నెర: లేకపోతే యేది వ్యక్తీకరించగలమో, యేది వ్యక్తీక రించలేమో మా కెట్లా తెలుస్తుంది?

మేనత్త: మన మిప్పుడు మహానటులని గురించి మాట్లాడు కుంటున్నాం.

కిన్నెర: ఓ (మేనత్త పీపుతట్టి) నన్ను గురించి ప్రచారం చెయ్యాలని వుందా యేం?

మేనత్త: నువు బొత్తిగా అల్లరి పిల్లవై పోతున్నావే?

నేను: అల్లరిపిల్లేంగాదు. కిన్నెరని గురించి నేను ప్రచారం చేస్తా చూడండి.

మే మిద్దరం మా వృత్తిని ఎలా అభివృద్ధి చేసు కుంటూ యెలా ముఖ్యమైన పరిశీలనలు చేశామో చెప్తాను. కిన్నెర ఒక మాటు గుడ్డిపిల్ల వేషం వేయ వలసి వచ్చింది. బాగా సాధన చేసింది. కాని ఆ వేషం గుడ్డిపిల్ల వేషం అంటే యెవరూ నమ్మలా. ఆపట్న నా దగ్గిరికి సలహాకి వచ్చింది. మే మిద్దరమూ

కలిసి గుడ్డివాళ్లెవణ్ణయినా పరిశీలిద్దామని బయలు దేరాం. చౌరాస్తాలో ఒక గుడ్డివాడు కూర్చొని వున్నాడు. యెంత సేపటికీ కదలలా. అతను యెలా దోవ వెతుక్కుంటూ నడుస్తాడో చూడాలని మేమూ అక్కడే నిలబడ్డాం. అలా నాలుగు గంటలు కాచు కూర్చున్నాక ఆగుడ్డివాడు లేచి బయలు దేరాడు. లేచి నడవమని మేమే అడిగాం అనుకోండి. వాడికి మేము చూస్తున్నామనే పరిజ్ఞానం వుండి సహజత్వం నశిస్తుంది. కళకోసమని అంతసేపూ యెండా ఆకలీ అనకుండా వాడివెంట వెళ్ళాం. గంటసేపు వాడి వెన కాతలే, దోవ తడుముకుంటూ యెలా నడుస్తున్నాడో పరిశీలించుతూ వెళ్ళాం. మా అనుభవం యెంతో అధిక మైంది. వాడికో రూపాయిచ్చి యింటికి చేరుకున్నాం. యిచ్చింది రూపాయైనా అంతకు యెన్నోరెట్లు విలువ గల అనుభవం సంపాదించాం. యెప్పుడు యే అను భవం అవసర మవుతుంతో చెప్పలేం. అందుకని యిలాంటివన్నీ పరిశీలించి బుర్రలో వుంచుకోవాలి. 'ఓనమాల' దగ్గిరనుంచీ ప్రారంభించాలి.

కిన్నెర: అత్తయ్యా! నే నొక కార్యక్రమం వేసుకున్నా. వీరు దాన్ని ఆమోదించారు.

నేను: అవును. అదంతా మీ అత్తయ్యకి చెప్పటం మంచిది.

కిన్నెర: మూడు నెలల వరకు, నేను యెక్కడున్నా, యేం చేస్తున్నా మధ్యాహ్నం పదకొండు దగ్గిర నించి

పన్నెండుదాకా నాకంటికి కగపడ్డ ప్రతిదీ, ప్రతిమనిషినీ పరిశీలిద్దామనీ, భోజనాల వేళ పన్నెండు దగ్గరనించి ఒంటిగంటదాకా ఆ కిందటి రోజు పరిశీలించిందంతా జ్ఞప్తికి తెచ్చుకోవాలనీ సంకల్పించాను. ఒంటరిగా వున్నానా, నే చూచిందంతా తిరిగి నటించేదాన్ని. యిలా మూడు నెలలు అనుభవం సంపాదించాను. మొదట నేను పరిశీలించిందంతా కాగితంమీద రాసి పెట్టి వుంచేదాన్ని. యిప్పుడు అలాంటి అవసరం యేదీ లేదు. నా మెదడులో నే చూసినవన్నీ వాటంతటవే హత్తుకుపోయాయి. వాటిని తిరిగి జ్ఞాపకం చేసుకోటం, ఆ చేష్టలను తిరిగి చేయటంవల్ల, యిప్పుడు తలుచుకుంటే చాలు, యెన్నినాళ్ళకింద పరిశీలించిందైనా చటుక్కున జ్ఞాపకం వస్తుంది. మానవ జీవితం యెంత అద్భుతమైందీ, యెంత విలువగలదీ అనుకున్నా!

మేనత్త: అమ్మాయి! యిక నువ్వు వేషాలు వేయటం మానేసి డికెక్టివుగా చేరటం మంచిది. అందులో నువ్వుయింకా బాగా రాణిస్తావు.

నేను : ప్రదర్శించిన ప్రతి నాటకం, అందులో అభినయించిన ప్రతిపాత్రా భూగర్భంలో దాగివున్న అపూర్వమణులను తవ్వి బైటకు తీయటంవంటిదికాదూ? సుగుణాలూ, దుర్గుణాలూ ఆవిష్కరించటం, అరిషడ్వర్గాలను అదుపులో వుంచుకోవటంవంటిదికాదూ! గది

కున్న నాలుగు గోడల్లో ఒక గోడ తీసేసి గదినంతటినీ బహిరంగపర్చటం వంటిదికాదూ! యెన్నడో మరణించినవారిని తిరిగీ ప్రజలముందు ప్రత్యక్షపర్చటం వంటిదికాదూ?

మేనత్త: బలే? మీరు చెప్పిందంతా భాగానేవుంది. గాని నాకేమో యిదంతా యధార్థమనిపించటంలేదు. యేదో సిద్ధాంతం! రాద్ధాంతం! నాటక కళావైఖరి, వక్కనాటకకళేమిటి, సకలకళావైఖరులు సహజంగా వుండాలి. యిప్పుడు నాటకరంగంమీద జరిగేది మన జీవితంలో యెక్కడా జరుగుతున్నట్టులేదు.

నేను : పోనిండి. ఆ గొడవ వదిలేద్దాం. మీ చెల్లెలుగారు బెంగుళూరునుంచి వచ్చిందని కిన్నెర చెప్పింది. వెళ్ళి చూచివచ్చారా! వారు భాగా కులాసాగావున్నారా?

మేనత్త: ఆ– వెళ్ళి చూచొచ్చా. భాగా కులాసాగానేవుంది. కాని వేషం, అదేంవేషం! సినిమావాళ్ళలాగా యిన్నేళ్ళొచ్చి రెండు జడలేమిటి? ముక్కుకి పుడకంటూలేదు. చెవులకి జూకామల్లిలోలుకులు తగిలించింది. జాకెట్టు తెల్లరంగుమీద పచ్చదార, నల్లచార, యెర్రచార, గళ్ళుగళ్ళుగా వుంది. యిక చీర కాఫీరంగుమీద పచ్చ గళ్ళు...యిక పైటచెంగు...

నేను: (హఠాత్తుగా అడ్డుతగిలి) యిప్పుడు మీరు చెప్పిందాన్ని బట్టి మీకు పరిశీలనాశక్తి వుందని బోధపడుతోంది.

మీరు ఆ శక్తిని యధార్థ జీవితంలో సహజంగా పెంపొందించుకున్నారు. యిక మేమో నాటకరంగం మీద పరిశీలనాపద్ధతిని సాధ్యమైనంతగా విస్తరించుకుని పెంపొందించుకుంటాం. ప్రతివస్తువునూ, ప్రతిచేష్టనూ, ప్రతి వ్యక్తినీ మా ఆశయ సిద్ధికి వుపయోగించుకుంటాం. కాకపోతే మేం దాన్ని గురించి మాట్లాడం... నటించి చూపుతాం. అంతే మీకూ మాకూ భేదం.

మేనత్త: (సంభాషణను మళ్ళించింది. నేను ప్రశాంతంగా టీ తాగాను. కిన్నెర దీర్ఘాలోచనలో పడింది)



